# థేరీ గాథలు

తొలితరం బౌద్ధ సన్యాసినుల కవిత్వం

అనుసృజన

**బొల్లోజు బాబా**



ఛాయ

హైదరాబాద్

**THEREE GAADHALU** - Poetry
Tholitaram Boudhasanyasinula kavitvam

Author: **Bolloju Baba**


Bolloju Baba
30-7-31 GollalaVeedhi
Suryanarayana Puram
Kakinada, Kakinada District
Andhra Pradesh – 533001
Ph: 9849320443
bollojubaba@gmail.com

First Edition:September, 2022

Published By:
**Chaaya Resources Centre**
103, Haritha Apartments,
A-3, Madhuranagar,
HYDERABAD-500038
Ph: (040)-23742711, Mobile: +91-70931 65151
email: chaayaresourcescenter@gmail.com

Publication No.: CRC- 66
ISBN No. 978-93-92968-14-3

Cover Design: Sri Giridhar Arasavelli
Book layout : Kranthi

Printed at:
Trinity Academy for Corporate Training Pvt. Ltd
Bangalore.

For Copies:
All leading Book Shops
https:/amzn.to/3xPaeId
bit.ly/chaayabooks

**Rs.150 /-**

## లోపలి పేజీలో...

# థేరీగాథలు

రెండువేల ఐదువందల అరవై అయిదు సంవత్సరాల కింద బుద్ధుడు మహాపరినిర్వాణం పొందిన తర్వాత భిక్షువులు మహాకాశ్యపథేరుని అధ్యక్షతన మగధదేశపు రాజధాని రాజగృహనగర సమీపంలో సప్తపర్ణికా గుహలో సమావేశమై సుత్త, వినయాలను సంగ్రహించారు. సుత్తపిటకలో బుద్ధుని బోధనలు ఉన్నాయి. వినయలో భిక్షుసంఘ నిర్మాణం, భిక్షువులు, భిక్షుణులు పాటించవలసిన నియమాలు ఉన్నాయి. సుత్తపిటకలో దీఘనికాయ, మజ్జినికాయ, సంయుత్తనికాయ, అంగుత్తర నికాయ, ఖుద్ధనికాయ అనే అయిదు భాగాలు ఉన్నాయి. అయిదవ భాగమైన ఖుద్ధకనికాయలోని 18 గ్రంథాలలో థేరీగాథలు ఒకటి.

కష్టాలు, కన్నీళ్ళతో అలసి కొందరు, భోగవిలాసాలను రోసి కొందరు, మొత్తమ్మీద ఎందరో స్త్రీలు సంఘంలో ప్రవ్రజించి బుద్ధభగవానుని సన్నిధిలో సేదదీరారు. స్వశక్తితో ప్రయత్నించి నిర్వాణపదాన్ని అందుకొన్నారు.

అటువంటి భిక్షుణులు రాసిన గాథలు ఈ థేరీగాథలు. బొల్లోజు బాబాగారు వీటిని తెలుగులోనికి అనుసృజించారు. బాబాగారు కవి, అనువాదకులు, పరిశోధకులు. బాబాగారి అనువాదం సరళంగా, సుందరంగా ఉంది. సూటిగా హృదయాన్ని తాకుతుంది.

తాను విముక్తి పొందిన విషయాన్ని పటాచార ఇలా తెలియజేస్తుంది –

"కాళ్ళు కడుక్కొన్నపుడు  నీటిని గమనించాను
అవి దొర్లుకొంటూ పల్లానికి పరుగులు తీస్తున్నాయి
నా మనస్సులోలోతుల్లోకి  తరచి చూసుకొన్నాను
నా మనసును కూడా అలా ఒదిలేసాను
అది కూడా దొర్లుకొంటూ నా కుటీరం వైపుకు
పరుగులు తీసింది

ఒక దీపం తీసుకొని నా కుటీరంలోకి వెళ్లాను
చాపపై కూర్చున్నాను
సూదితో  వత్తిని వెలుపలకి లాగాను
దీపం ఆరిపోయింది
నా మనస్సు కూడా విముక్తమయింది"

తనను ఇంద్రియసుఖాలవైపు ఆకర్షించాలని చూసిన మారునితో శైల ఇలా అంటున్నది

మారుడు:
ఈ లోకంలో విముక్తి లేదు
ఒక్కతివే ఏం సాధిస్తావు
ప్రియునితో కూడి సుఖించు
వయసు వాంఛలు తీర్చుకో
తరువాత పశ్చాత్తాపపడేవు

శైల:

ఇంద్రియ సుఖాలు  కత్తులు శూలాల వంటివి
అవి నిత్యం ఈ దేహం, మనస్సులను ఖండిస్తూంటాయి
నువ్వు వేటిని సుఖాలంటున్నావో అవి నన్ను ఆకర్షించవు
హృదయంలోని మృత్యువు, పెనుచీకట్లు తొలగిపోయాయి
దురాత్ముడా!
నిన్నేనాడో జయించాను నేను

భిక్షుణి సామ ఇలా అంటుంది–

తథాగతుని బోధనలతో నా కోర్కెలను జయించి
ఈ రోజుకు ఏడవ రోజు
ఇన్నాళ్ళకు
ఈ క్షణంతో నాకు వివాహమైంది
మేమిద్దరం ఏ గొడవలూ లేకుండా
సహజీవనం చేస్తున్నాం
జీవితమిపుడు నిశ్చలం, నిర్మలం



భర్తను, ఇద్దరు పిల్లలను, తలిదండ్రులను అందరినీ పోగొట్టుకొని పిచ్చిదైన పటాచర, కొడుకును కోల్పోయి ఉన్మత్త అయిన కిసగౌతమి, యవ్వనం ఎలా కరిగిపోయిందో వర్ణించిన ఆమ్రపాలి, తల్లి తాను ఒకే పురుషునికి భార్యలమని తెలిసిన వెంటనే దేహవాంఛలను రోసి ప్రవ్రజించిన ఉత్పలవణ్ణ, నీళ్ళలో మునిగితే పాపాలు పోతాయనుకొన్న బ్రాహ్మణునికి దారి చూపించిన దాసి పుణ్ణ, వేశ్య అర్ధకాశి, తనకళ్ళను మోహించిన యువకునికి కంటిగ్రుడ్డునే పెకిలించి ఇచ్చిన సాహసి శుభ, భర్తను ఇంటిలోనే ఆపాలని ప్రయత్నించి విఫలమైన కాప, మావటివాడు చెప్పినట్లు వింటున్న

ఏనుగుని చూసి, మనస్సును నిగ్రహించటానికి ధైర్యాన్ని పొందిన దంతిక ఇలా ఒక్కొక్కరిదీ ఒక్కొక్క కథ.

జీవితాన్ని మనం ఎంత ప్రేమించినా అది స్థిరమైంది కాదు,

అది మనం తాగుతుండగానే చేతివేళ్ల సందుల నుండి జారిపోయే నీటిలాంటిది.

అందుకే బుద్ధుడు అనిత్య, దుఃఖ, అనాత్మల గురించి బోధించాడు.

యవ్వనం, సుఖసంపదలు, కీర్తిగౌరవాలు అన్నీ అనిత్యం.

నిర్వాణం ఒక్కటే సత్యం. దానికి ఈ భిక్షుణులు తమ కవితల ద్వారా సాక్ష్యం పలుకుతున్నారు.

బాబాగారు దీనికి చక్కని కవితాత్మక ముగింపునిచ్చారు

ఈ మార్గం ఒక పాటలాగా
సాగుతోంది.
సముద్రంలో తప్పిపోయిన నావికుడు
తీరాన్ని చేరుకొన్నట్లు
నీకు కూడా గమ్యం దొరుకుతుందిలే
వినబడుతోందా?
ఆకుల మధ్య అలల సంగీతం
ముందుకు సాగు!

బావికొండ, తొట్ల కొండలు, అజంతా, ఎల్లోరాల ప్రాభవం కాలగర్భంలో కలిసిపోయినా, ఇప్పటికీ ఆ మార్గం మాత్రం పాటలాగా సాగుతూనే ఉంది

**బిక్షు ధమ్మరక్షిత**

2.08.2022

# మనవి మాటలు

థేరీ అంటే సన్యాసిని/భిక్షుణి అని అర్థం. తొలితరం బౌద్ధ సన్యాసినులు[1] తమ అనుభవాలకు ఇచ్చుకొన్న కవిత్వరూపమే థేరీ గాథలు. ఈ గాథలు BCE ఆరోశతాబ్దానికి చెందినవి అయినప్పటికీ చాలాకాలం మౌఖికంగా ఉండి BCE 80లో పాలి భాషలోకి గ్రంథస్థం అయ్యాయి. మానవ దుఃఖం, వేదన, ముక్తికొరకు అన్వేషణ, తథాగతుని బోధనలలో దొరికిన సాంత్వన ఈ గాథల ప్రధాన ఇతివృత్తాలు.

CE ఆరోశతాబ్దంలో ధర్మపాలుడు థేరీగాథలకు వ్యాఖ్యానం వ్రాసాడు. థేరీగాథలు ప్రపంచ సాహిత్యంలోనే తొలి కవితాసంకలనం మరీ ముఖ్యంగా స్త్రీలు వ్రాసిన కవిత్వం. మొత్తం 494 థేరీ గాథలను 73 మంది వివిధ థేరీలు రచించారు. వీరిలో బ్రాహ్మణులు 21, క్షత్రియులు 27, వైశ్యులు 17, శూద్రులు 8 మంది అని Peggy Kim Meill గుర్తించాడు.

థేరీగాథలు పాలిభాషనుండి ఇంగ్లీషులోకి 1909లో అనువదించబడ్డాయి. ఈ గాథలు గానానికి వీలుగా పాటలుగా, సత్సంగంలో చెప్పుకొనే కథలుగా ఉంటాయి. ప్రతీ గాథ క్రింద దానిని రచించిన వారు పేరు ఉంటుంది. వారు నిజంగా ఆ గాథలను రచించిన థేరీలా, వారసలు స్త్రీలేనా అనే ప్రశ్నలు రాకమానవు. దీనికి సమాధానంగా– ఇతర బౌద్ధ రచనలలో వచ్చే 20 మంది భిక్షుణుల పేర్లు ఈ 73 థేరీల పేర్లతో సరిపోలుతుండటం ఈ థేరీగాథలలో చెప్పిన వివిధ జీవితానుభవాలలో 40 కథలు ఆనాటి సమకాలీన ఇతర బౌద్ధ గ్రంథాలలో కూడా ఉండటాన్ని బట్టి ఈ థేరీగాథలు కల్పితగాథలు కావని, వాటిని వ్రాసిన వ్యక్తులు చారిత్రిక స్త్రీలేనని పండితులు నిర్ధారించారు

ఈ థేరీలందరూ సమాజంలో రాజమాతల నుండి వేశ్యలవరకూ వివిధ సామాజిక స్థాయిలనుంచి వచ్చారు. భిన్న నేపథ్యాలను కలిగి ఉన్నారు. వీరందరికీ బౌద్ధం ఏ విధంగా మానసిక ధైర్యాన్ని, జీవనేచ్ఛని, జ్ఞానాన్ని ఇచ్చిందో వీరే వివిధ గాథలలో చెప్పుకొన్నారు.

ఈ రచనలో నాకు సహాయపడిన పుస్తకాలు– Therigathapali, book of verses of Elder Bhikkhunis by Anagarika Mahendra, The First Buddhist Women by Susan Murcott, Poems of the First Buddhist Women by Charles Hallisey, Women in the footsteps of the buddha, Kathryn R. Blackstone, The First free women, poems of the early buddhist nuns by Matty Weingast, Psalms of the Early Buddhists by Mrs. Rhys Davids, ఇంకా accesstoinsight.org https://suttacentral.net/ లాంటి వెబ్‌సైట్లు.

భిన్న మూలాలపై ఆధారపడి రచించాను కనుక దీనిని అనువాదంగా కాక అనుసృజనగా భావిస్తాను. కొన్నిచోట్ల భావం చెడకుండా

సంక్షిప్తీకరించాను ముఖ్యంగా చివరి గాథలు. పునరుక్త గాథలను వర్జించాను. సౌలభ్యం కొరకు రూపస్వేచ్ఛ తీసుకొన్నాను. ఇదంతా మూలవిధేయంగా ఉంటూనే తీసుకొన్న స్వతంత్రం. సహృదయులు అర్ధంచేసుకొంటారని భావిస్తాను. ఆనాటి సమాజం ఎలాఉండేదో తెలుసుకోవటం కొరకు పుస్తకం చివరలో విపులమైన నోట్స్ ఇచ్చాను.

ఈ రచన చేసే సమయంలో ఎన్నో సందేహాలను నివృత్తి చేసి, బౌద్ధ పరిభాషకు సంబంధించిన పొరపాట్లను సరిదిద్దిన పూజ్య **బిక్ఖు ధమ్మరక్షిత** గారికి వినమ్రపూర్వక నమస్సులు.

థేరీగాథలు 2600 సంవత్సరాల క్రితపు సమాజాన్ని స్త్రీ దృక్కోణంలోంచి మనకు చూపిస్తాయి. శ్రీ వాడ్రేవు చినవీరభద్రుడు గారు ఒక వ్యాసంలో అన్నట్లు క్రీస్తుపూర్వపు 6వ శతాబ్దమంతా ఈ కవితా సంకలనంలో కనిపిస్తుంది.

భవదీయుడు

**బొల్లోజు బాబా**

25.07.2022

## థేరికా[2]

(బుద్ధభగవానుడు అన్నమాటలు)

థేరికా!
ఇప్పుడు నీవు థేరీలలో  కలిసావు
నీకు చిన్నప్పుడు పెట్టిన పేరు ఇన్నాళ్ళకు నిజమైంది
నీవు స్వయంగా కుట్టుకొన్న బొంత కప్పుకొని
హాయిగా నిదురించు
నీ వాంఛలన్నీ కుండలో దాచిన మూలికల్లా
వడలి ఎండి పోతాయి ఇక.

# ముత్త[3]

(బుద్ధభగవానుడు ముక్తతో ఇలా అన్నాడు)

ముత్త నీపేరులోనే ఉంది
నీవు స్వేచ్ఛనొందావని
గ్రహణం ముగిసాక
రాహువు చీకటికోరలనుండి
విముక్తినొందిన చందమామవు నీవు

ఏ బంధనాలు లేని మనస్సుతో
నీ భిక్షను తృప్తిగా ఆరగించు

## పున్న[4]

(బుద్ధభగవానుడు పున్నతో ఇలా అన్నాడు)

పున్న నీ పేరుకు తగ్గట్టు
పౌర్ణమి రోజున చంద్రునిలా
మంచి విషయాలతో
నిన్ను నీవు నిండుగా నింపుకో
సంపూర్ణ జ్ఞానంతో
ఈ సువిశాల చీకట్లను ఛేదించు

# తిస్సా! [5]

సాధనను సాధన చేయి
నిన్ను అనుబంధాలు కబళించనీయకు
సంకెళ్ళ నుంచి విముక్తమవ్వు
ఈ లోకంలో
నిష్కల్మషంగా జీవించు

## మరొక తిస్సా[6]

(బుద్ధభగవానుడు చెప్పిన విషయాలను మననం చేసుకొంటున్నది)

తిస్సా
ధమ్మ మార్గాన్ని ఎన్నడూ విడువకు
ఈ క్షణాన్ని చేజార్చుకోకు
చేజార్చుకొన్నవారు
దురవస్థల పాలయ్యారు

# ధీర

(బుద్ధభగవానుడు చెప్పిన విషయాలను మననం చేసుకొంటున్నది)

ధీరా!
నీ పేరులోనే ఆత్మవిశ్వాసం ఉన్నది
నిబ్బాణని[1] నీ గమ్యంగా చేసుకో
అక్కడ అన్ని ఇంద్రియాలు నిశ్చలమౌతాయి
అక్కడ గొప్ప ఆనందం నెలకొని ఉంది
వెనక్కు లాగే అన్ని శక్తుల నుండీ అదే నిన్ను రక్షిస్తుంది

1. నిబ్బాణ/నిర్వాణ అంటే రాగ, ద్వేష, మోహాలను అధిగమించిన స్థితి

# వీర

(బుద్ధభగవానుడు చెప్పిన విషయాలను మననం చేసుకొంటున్నది)

వీరా! నీ పేరులోనే వీరత్వం ఉంది
నీ ధైర్యసాహసాలకు తగిన పేరది
నీవిపుడు భిక్షుణివి.
ఇంద్రియ నిగ్రహం పొందిన దానవు
నీ దేహాన్ని మరోసారి మృత్యువాహనం కానీయకు
జన్మరాహిత్యం సాధించు

## మిత్త

(బుద్ధభగవానుడు చెప్పిన విషయాలను మననం చేసుకొంటున్నది)

మిత్తా
ఇంటిని విడిచి
విశ్వాసంతో భిక్షుణిగా మారావు
మిత్రుల మధ్య సాంత్వన చవిగొను
సాధన చేయి శాంతిని పొందు

# భద్ర

(బుద్ధభగవానుడు చెప్పిన విషయాలను మననం చేసుకొంటున్నది)

భద్రా!
విశ్వాసంతో భిక్షుణిగా మారావు
పవిత్రవిషయాలలో ఉండే ఆనందాన్ని ఆస్వాదించు
యోగక్షేమాన్ని[2] సాధన చేయి
వెనక్కు లాగే అన్ని శక్తుల నుండీ
అదే నిన్ను రక్షిస్తుంది

[2]Yogakcema refers to "salvation" (ముక్తి) according Mahâprajñâpâramitâúâstra (chapterIV)

# ఉపశమ

(బుద్ధభగవానుడు చెప్పిన విషయాలను మననం చేసుకొంటున్నది)

ఉపశమా!
ఈ ప్రవాహాన్ని నీవు దాటాలి
ఇది మృత్యుమార్గం, అత్యంత కష్టమైనది
నీవు ఇప్పటికే
అన్ని ప్రలోభాలని జయించావు
కొద్దిగా ఓరిమితో ఉండు
ఇదే నీ చివరి జన్మ

# ముత్త[7]

నేను స్వేచ్ఛనొందాను
మూడు కుటిల విషయాలనుండి
భర్త, రోలు, రోకలి

నేను ముక్తినొందాను
నన్ను వెనక్కిలాగే
మూడు కుటిల విషయాలనుండి
జననం, మరణం, పునర్జన్మ

# ధమ్మదిన్న[8]

దుఃఖాన్ని అంతమొందించాలనే కోర్కె
స్వేచ్ఛనొందాలనే కాంక్ష
సరైన మార్గం అదే

ఎవరి హృదయం
భోగలాలసకు కేంద్రం కాదో
ఆమె ప్రవాహంలోకి[3] ప్రవేశించినట్లే

3. అష్టాంగమార్గమనే ప్రవాహం గుండా ప్రయాణించి నిబ్బాణమనే సముద్రాన్ని చేర యత్నించే వ్యక్తిని (Stream Enterer) ప్రవాహంలోకి ప్రవేశించిన వ్యక్తి అంటారు

# విశాఖ[9]

బుద్ధభగవానుడు చెప్పినది ఆచరించు
నీవెన్నటికీ పశ్చాత్తాపపడవు
రా... విశాఖ!
కాళ్ళు శుభ్రం చేసుకొని వచ్చి
ఆయన సమక్షంలో కూర్చో

# సుమన[10]

ఈ చరాచర సృష్టిని
దుఃఖంగా భావించినపుడు
నీకు పునర్జన్మ ఉండదు
నీలోని కోర్కెలను త్యజించినపుడు
నీలో శాంతి వెల్లివిరుస్తుంది

# ఉత్తర[11]

దేహము
మనస్సు
మాటలను
సంపూర్ణ  స్వాధీనములోకి తీసుకొన్నాను
వాంఛలను వేళ్ళతో పెళ్ళగించాను

ఇప్పుడు
జ్వాలలు చల్లారి, శాంతిగా ఉంది

# సుమన[12]

నిదురపో వృద్ధనారీ
నువ్వు స్వయంగా కుట్టుకున్న
బొంత కప్పుకుని హాయిగా నిదురపో
నీ వాంఛలన్నీ శమించాయి
నీ దాహం తీరి శాంతినొందావు

# ధమ్మ[13]

ఉదయంనుంచి
భిక్షకోసం
సంచరిస్తున్నాను
నిస్సత్తువ ఆవహిస్తోంది

చేతికర్రపై బరువు ఆనించి
ఎర్రటి ఎండలో రోడ్డుమధ్య
నిలుచున్నాను
ఆకలితో దేహం మొత్తం
ఒణికిపోతోంది

తాళలేక కూలిపోతుండగా
నేను దర్శించాను

నేనే
ఒకగుప్పెడు మెతుకులు
ఈ ప్రపంచం మొత్తం
ఒక భిక్షా పాత్ర

ఈ దేహ దౌర్భల్యం స్పష్టంగా కనిపించింది
ఆ క్షణమే
నా హృదయం స్వేచ్ఛనొందింది

## సంఘ

ఇంటిని
కొడుకుని
పశుసంపదను
ఇష్టపడే వాటన్నిటినీ
త్యజించాను
అజ్ఞానం పటాపంచలైంది
కోర్కెలను జయించాను
దాహం తీరింది
ఇప్పుడు
ఎంతో శాంతిగా ఉంది నాకు

# అభిరూపనంద[14]

(బుద్ధభగవానుడు చెప్పిన విషయాలు)

నందా
ఆ మానవ దేహాన్ని చూడు
రోగగ్రస్తమై, మలినపడి, చెడిపోయిన దేహం
ఆ కల్మషాలన్నిటిపైనా నీ దృష్టి నిలుపు

అనియంత్రితమైనదాన్ని
అదుపులోకి తెచ్చే ధ్యానాన్ని సాధనచేయి
నిన్ను నీవు ఇతరులతోపోల్చుకొని
ఏర్పరచుకొన్న అభిప్రాయాలను,
మిడిసిపాటును విడనాడు
నీలో శాంతి వెల్లివిరుస్తుంది

## జెంతి[15]

నేను పదే పదే దారితప్పుతున్నాను
ఒక రోజు బుద్ధభగవానుడు ఇలా అన్నారు
ఈ దారిలో నడవటానికి నీకు
ఏడుగురు స్నేహితులు[4] కావాలి
ఎరుక, పరిశీలన, పరాక్రమం, ఆనందం,
ప్రశాంతి, ఏకాగ్రత, సమతుల్యత

చాలా సంవత్సరాలు ఈ స్నేహితులతో కలిసి చరించాను

నేను వారందరినీ అర్థం చేసుకొన్నాను
తథాగతుని దర్శనాన్ని పొందాను

4. సప్త-బోధ్యంగములు 1.స్మృతి (ఎరుక) 2.ధర్మవిచయము (పరిశీలన) 3.వీర్యము (పరాక్రమం) 4.ప్రీతి (ఆనందం) 5.ప్రశ్రబ్ధి (ప్రశాంతి) 6. సమాధి (ఏకాగ్రత) 7.ఉపేక్ష (సమతుల్యత). ఇవి జ్ఞానోదయానికి తోడ్పడే అంగాలుగా చెప్పబడ్డాయి.

ఇదే నా చివరి దేహం
జనన మరణ వలయం నుండి విముక్తి చెందాను
ఇది నా చివరి జన్మ

ఇప్పుడు నేను శాంతిని, స్వేచ్ఛను

# సుమంగళుని తల్లి[16]

(కొడుకుతో సంభాషణ)

నేను స్వేచ్ఛనొందాను
నా రోలు రోకలి నుండి విముక్తి పొందినందుకు
చాలా ఆనందంగా ఉంది
నా భర్త పట్లా
అతను పనిచేసే చావిడి పట్లా
నా వంటపాత్రల పట్లా
విరక్తి చెందాను

వేడి ఇనుప కడ్డీని నీటిలో
ముంచినప్పుడు వచ్చే శబ్దాల వలె
సడిచేస్తూ నా రాగ ద్వేషాలు చల్లారిపోయాయి

చెట్టు నీడకు చేరి
"ఓ ఆనందమా!

నాతో కలిసి ధ్యానం చేయి"
అంటూ నన్ను నేను సంబోధించుకొంటాను

# అర్ధకాశి[17]

ఒకప్పుడు నా వెల నిర్ణయించినపుడు
అది  కాశి పట్టణం  మొత్తం సంపాదనతో
సమానంగా ఉండేది
చాలామంది విటులు గడిచాకా
నా ధర సగానికి తగ్గించబడింది
అలా అర్ధ కాశి నయ్యాను

ఈ దేహం నాకు ఇచ్చినవి ఇక చాలు అనిపించింది
అలసిపోయాను. రోసిపోయాను
ఈ పరుగు నిలిపివేసి
జనన మరణ వలయాన్ని భగ్నం చేయాలనిపించింది
బుద్ధభగవానుడు ఉపదేశించిన త్రివిద్యలను[5]
అభ్యసించి జన్మరాహిత్యాన్ని  సాధించాను

5. త్రివిద్య లేదా తేవిజ్జలు  1. పూర్వజన్మల స్మరణం 2. దివ్యదృష్టి 3. ఆస్రవక్షయజ్ఞ జ్ఞానం (చిత్తమలినాలు నశించాయి అని తెలుసుకోవటం)

# చిత్త[18]

నేను బక్కచిక్కి బలహీనంగా ఉన్నప్పటికీ
చేతికర్ర సహాయంతో
గృధ్రకూట పర్వతాన్ని[6] అధిరోహించాను
దుస్తులు చెదిరిపోయాయి
భిక్షాపాత్ర తల్లక్రిందులైంది
ఒక రాతిపై కూర్చొని చేసిన ధ్యానంతో
నేను ఇంతకాలమూ మోసుకొంటూ వస్తున్న
లక్షల పర్వతాల బరువుండే చీకట్లు
ఒక్కసారిగా నా భుజంనుండి క్రిందకు జారి
పటాపంచలై
గాలిలో కరిగిపోయాయి

6. రాజగృహ సమీపంలో ఒక పెద్ద పర్వతం కూర్చున్న గద్ద ఆకారంలో ఉంటుంది కనుక దానికి గృధ్రకూట పర్వతం అనే పేరు వచ్చింది. (Vulture Peak, Bihar). ఇక్కడ బుద్ధభగవానుడు తన శిష్యులకు అనేక బోధనలు చేసాడు. బౌద్ధులకు ఇది నేడు దర్శనీయ పుణ్యక్షేత్రము

## మెత్తిక

నేను రుజాగ్రస్తనై బలహీనంగా ఉన్నప్పటికీ
చేతికర్ర సహాయంతో గృధ్రకూట పర్వతాన్ని
అధిరోహించాను
నా కంబళి,  భిక్షాపాత్రని
దూరంగా విసిరేసాను
ఒకరాతిపై కూర్చున్నాను
ఇప్పుడు నేను శాంతిని, స్వేచ్ఛని

చాలామందికి తెలియని మూడు విషయాలు
ఇప్పుడు నా సొంతం
బుద్ధభగవానుడు చెప్పింది సత్యం

# మిత్తా[19]

ఉత్తమ జన్మ కొరకు
ఎన్నో ఉపవాసాలు ఉన్నాను
అష్టమి, ఏకాదశి, చతుర్ధశి, పౌర్ణమి
ఇంకా అన్ని పర్వదినాలలోను
కఠోరమైన ఉపవాసాలు ఉండేదాన్ని

ఈ రోజు
శిరోముండనం గావించుకొని
కాషాయవస్త్రాలు ధరించి,
ఒక పూటే తింటున్నాను
ఉత్తమ జన్మ పట్ల నా మనసులో
ఏ బెంగా లేదిక

# అభయుని తల్లి[20]

(కొడుకు చెప్పిన మాటలు మననం చేసుకొంటూ తనలో తాను మాట్లాడుకొంటూ)

తల్లీ!
శిరస్సు నుండి క్రిందకు
పాదాల నుండి పైకి చూడు
ఎంత మురికి, ఎంత దుర్గంధమో!

ఆ మాటలు వినగానే
నా వాంఛలన్నీ సమూలంగా నశించాయి
నన్ను దహిస్తోన్న తాపం శమించింది
నేనిపుడు విరాగిని, ప్రశాంతిని

# అభయ[21]

(బుద్ధభగవానుడు చెప్పిన మాటలు మననం చేసుకొంటూ తనలో తాను మాట్లాడుకొంటూ)

అభయా!
"సామాన్యులు ఈ దేహాన్ని ప్రేమిస్తారు కానీ
అది ఎంతో పెళుసైనది
ఏ క్షణమైనా విరిగిపోగలదు
అంతఃకరణ శుద్ధితో ఈ దేహపు ఉనికిని
మరచిపోవటాన్ని సాధన చేయి"

జీవితంలోని దుఃఖం నన్ను అనునిత్యం
మెలకువతో ఉండేట్లు చేసింది
తథాగతుని బోధనలతో నా కోర్కెలన్నీ నశించాయి

# సామ[22]

ఇదివరలో
నాలుగైదు సార్లు ఆరామం నుంచి పారిపోయాను
హృదయంలో శాంతి లేక బుద్ధిపై  నియంత్రణ లేక

జీవితంలోని దుఃఖం నన్ను అనునిత్యం
మెలకువతో ఉండేట్లు చేసింది
మా అమ్మ అంటూండేది
వివాహంలో ఆనందం దొరుకుతుందని

తథాగతుని బోధనలతో నా కోర్కెలను జయించి
ఈ రోజుకు ఏడవ రోజు

ఇన్నాళ్ళకు
ఈ క్షణంతో నాకు వివాహమైంది

మేమిద్దరం ఏ గొడవలూ లేకుండా
సహజీవనం చేస్తున్నాం
జీవితమిపుడు నిశ్చలం, నిర్మలం[7]

7. సామ పేరుతో ఒకేలా ఉండే రెండు కవితలు కలవు.

## ఉత్తమ[23]

ఇదివరలో
నాలుగైదు సార్లు ఆరామం నుంచి పారిపోయాను
హృదయంలో శాంతి లేక బుద్ధిపై  నియంత్రణ లేక

ఒక భిక్షుణిని కలిసాను
నాకామె విశ్వసించదగిన వ్యక్తిగా అనిపించింది
ఆమె నాకు ధమ్మమార్గాన్ని
మానవదేహ ధాతువులు, మూలతత్వం
ఇంద్రియ విషయాల[8] గురించి బోధించింది

ఆమె బోధనలను ఏడురోజుల పాటు
సుఖాసనం వేసుకొని విన్నాను

8. రూపం, శబ్దం, రుచి, స్పర్శ, వాసన, ధమ్మ ఇవి ఇంద్రియవిషయాలు

ఎనిమిదవ రోజున ఆసనం నుండి లేచాను
గొడ్డలిని కలిసేందుకు చెట్టు లేచినట్లు
కత్తిని కలిసేందుకు వెంట్రుకలు లేచినట్లు
చీకటిని కలిసేందుకు చల్లారిన మంటల రవ్వలు లేచినట్లు
మట్టిని కలిసేందుకు ఈ దేహం లేచినట్లు

నన్ను కమ్మిన పెంజీకట్లు తొలగిపోయాయి
ఎల్లెడలా కాంతి[9]

9. ఉత్తమ పేరుతో ఉన్న మరొక గాథ (45–47 ) జెంతి గాథ వలె ఉంది

# దంతిక[24]

గృధ్రకూట పర్వతంపై
ధ్యానం కొరకు వెళ్ళాను
అక్కడ ఒక ఏనుగు
నదిలోంచి నడుచుకొంటూ బయటకు వస్తోంది

పురుషుడొకడు ఆ ఏనుగును ఆపి
దానికి అంకుశాన్ని చూపాడు
అది ముంగాలు ముందుకు చాచింది
అతను దానిని అధిరోహించాడు

ఒక అడవి మృగం నా కళ్ళముందే
ఒక మానవునిచే మచ్చికకాబడింది

అది చూసాకా నాకు నమ్మకం వచ్చింది
అడవిలోకి వెళ్ళి సాధన మొదలుపెట్టాను

# ఉబ్బిరి[25]

తథాగతుడు:
జీవా... జీవా[10] అంటూ రోదిస్తూ
అడవిలో సంచరిస్తున్నావు, సంభాళించుకో! తల్లీ!
జీవా అనే పేరుగల ఎనభైనాలుగు వేల మంది  కుమార్తెలు
ఈ స్మశానములో చితిపై కాలిపోయారు
వారిలో ఏ కుమార్తె కొరకు నీవు దుఃఖిస్తున్నావు?

ఉబ్బిరి:
కుమార్తె అకాల మృత్యువు కారణంగా
నా హృదయంలో దిగిన దుఃఖమనే అదృశ్య బాణాన్ని
తథాగతుడు తీసివేసాడు

10. మరణించిన కూతురి పేరు

ఈ రోజు  బాణం లేదు
హృదయగాయం నయమైంది
నేను బుద్ధభగవానుని
ఆయన ధమ్మాన్ని, సంఘాన్ని చేరి
శరణువేడుకొంటున్నాను

## సుక్క[26]

(చెట్టు దేవత ఇలా అన్నది)

రాజగృహ[11] ప్రజలకు ఏమైంది
మత్తులై ప్రవర్తిస్తున్నారు
సుక్క చేస్తున్న బుద్ధుని బోధనలను
వినటం లేదు

బాటసారులు తీయని వర్షపునీటిని
అలుపెరగక సేవించినట్లు
కొద్దిమంది జ్ఞానులు ఆమె మాటలను
ఆలకిస్తున్నారు

సుక్కా!
ప్రకాశించే నీ మేధస్సుచేత నువ్వు వెలుగై ఉన్నావు

11. రాజగృహ బుద్ధునికి ఇష్టమైన నగరం. పాలీలో రాజగహ, ఆధునిక రాజగిరి, బీహార్

మార[12] ని జయించావు
కోర్కెలనుండి విముక్తమయ్యావు
ఈ శరీరాన్ని జాగ్రత్తగా చూసుకో
ఇదే నీ ఆఖరుది
మరల మరల జన్మించేందుకు అది కారణం కాకూడదు!

12. బౌద్ధ వాఙ్మయంలో చెడుకు సంకేతం మార

## శైల[27]

(మార శైలతో ఇలా అన్నాడు)

ఈ లోకంలో విముక్తి లేదు
ఒక్కతివే ఏం సాధిస్తావు
ప్రియునితో కూడి సుఖించు
వయసు వాంఛలు తీర్చుకో
తరువాత పశ్చాత్తాపపడేవు

(శైల బదులిచ్చింది ఇలా)

ఈ లోకంనుండి బయటకుపోయేందుకు
నేను నా అంతర్దృష్టితో
ఒక మార్గాన్ని ఎంచుకొన్నాను
అలాంటి విముక్తి మార్గం తెలియని
దుర్మతి! నీవే చెడిపోయావు

ఇంద్రియ సుఖాలు  కత్తులు శూలాల వంటివి
అవి నిత్యం ఈ దేహం, మనస్సులను ఖండిస్తూంటాయి
నువ్వు వేటిని సుఖాలంటున్నావో అవి నన్ను ఆకర్షించవు
హృదయంలోని మృత్యువు, పెనుచీకట్లు తొలగిపోయాయి
దురాత్ముడా!
నిన్నేనాడో జయించాను నేను

## సోమ[28]

మార సోమతో ఇలా అన్నాడు

యోగులు చేరుకొనే గమ్యాలు
చాలా కష్టమైనవి
వండటం, అంట్లుతోమటం,
పిల్లల్ని కనటం తప్ప మరేమీ రాని
స్త్రీలకు
మరింత కష్టం

సోమ బదులిచ్చింది ఇలా

హృదయం స్వాధీనంలో
లోచూపు స్పష్టంగా
సత్యదర్శనం సరిగా ఉన్నప్పుడు
స్త్రీ అయితే ఏంటట?
పురుషుడు అయితే ఏంటటా?

స్వేచ్ఛనొందిన హృదయానికి అందే
అనంతమైన దూరాలతో పోల్చినపుడు
కొన్ని అంగుళాల మాంసపు తునక ఏపాటిది?
కోర్కెలను జయించాను
పెంజీకట్లను తుంచివేసాను
ఓ దురాత్ముడా!
నిన్ను కూడా జయించాను నేను.

# భద్ద కాపిలాని[29]

బుద్ధభగవానుడి వారసుడు కస్సప
గొప్ప సాధకుడు
పూర్వజన్మల ఎరుక కలిగినవాడు
స్వర్గ నరకాలను చూడగలడు
జన్మరాహిత్యాన్ని పొందినవాడు
ఉత్కృష్టమైన ఆస్రవక్షయజ్ఞానం పొందిన మహా జ్ఞాని

అదేవిధంగా భద్దకాపిలాని కూడా
త్రివిద్యలను అభ్యసించి, మృత్యువును జయించి
జన్మరాహిత్యాన్ని పొందింది

మా ఇద్దరికి వివాహం అయ్యాకా
ఈ లోకపు దుఃఖాన్ని చూసి
సాంసారిక బంధనాల్లో చిక్కుకోక

ఇరువురం సన్యసించాం
స్వేచ్ఛగా శాంత చిత్తులమై
ధమ్మమార్గంలో కలిసి ప్రయాణిస్తున్నాం

# ఒకానొక భిక్షుణి (అనామిక)[30]

ఇంటిని విడిచి ఏళ్లు గడిచాయి
కూర్చోవటం, నడవటం, ఎదురుచూడటం
ఇదే నా దినచర్య
చర్మం ఎండిపోవటం, జుత్తు నెరవటం
గమనించుకోనేలేదు,
హఠాత్తుగా నేను వృద్ధురాలినైపోయాను

ఓ రోజు ఒక పొలంలో నిద్రించాను
భోరున వాన
ఆ బురదలో, నిస్సహాయంగా నేను
ఇంటికి చేరినట్లు అనిపించింది.

ఎవరో నన్ను ఆరామానికి మోసుకొచ్చారు
ఆ రాత్రి నాకు అర్ధమైంది

మనం ఎక్కడనుంచి వచ్చాం
ఎక్కడకు వెళుతున్నాం అని

నా పూర్వజన్మల ఎరుక కలిగింది
నా దృష్టి దివ్యత్వాన్ని పొందింది
నా శ్రవణం స్ఫుటితపడింది
ఇతరుల మనసు గ్రహించగలుగుతున్నాను
గొప్ప మానవాతీత  శక్తులను సాధించాను
లోపలనుంచి జనించే తీవ్రవాంఛలను జయించాను
బుద్ధుని బోధనలు సఫలమైనాయి

## విమల[31]

యవ్వనం
కాంతులీనే చర్మం
వంకలేని దేహాకృతి
అతిలోక సౌందర్యం
అపరిమితమైన పేరు ప్రఖ్యాతులతో
కనులు మూసుకొనిపోయి
ఇతరులు ఎవరూ నా కంటికి కనపడేవారు కారు

నా యవ్వనాన్ని మా అమ్మ
డబ్బుకు,  అధికారానికి
ఎలా అమ్ముకోవాలో నేర్పింది.
ఆమె అమ్మ తనకి నేర్పినట్టుగానే.
అందంగా అలంకరించుకొని
వేశ్యాగృహం బయట వేటగత్తెలా నిలుచుని

వలలో చిక్కుకొన్న మగవాళ్ళని చూసి నవ్వుకొనేదాన్ని

నేడు
శిరోముండనం
కాషాయ వస్త్రాలు
భిక్షుకజీవనం
అన్ని బంధాలను తెంచుకొని
చెట్టు నీడలో ఉన్నాను నేను
లోలోపల బడబాగ్ని చల్లారింది

నా జీవితంలోంచి
దేవుళ్ళను, మగవాళ్ళను తరిమేసాను

## సిహా[32]

దైహిక వాంఛల పట్ల ఆలోచనలతో
మనసులో కుదురు ఉండేది కాదు
ఏదో తెలియని సలపరింత

ఆనందాలని స్వప్నిస్తూ
కామాతురనై నిర్లజ్జగా జీవించాను
మనశ్శాంతి ఉండేది కాదు
ఏదో తెలియని వ్యాకులత

కృశించి వెలవెలబోయి
దిక్కుతోచక త్రోవ తెలియక
ఏడేళ్ళపాటు  అతృప్తనై సంచరించాను

ఈ గమ్యంలేని జీవితం పట్ల రోసి

ఒకతాడు తీసుకొని ఉరివేసుకొందామని
అరణ్యానికి వెళ్ళాను
ఉరితాడును మెడకు బిగించుకొంటుండగా
ఒక్కసారిగా...
నాకు జ్ఞానోదయం అయింది
ఆ క్షణమే!

## నందుత్తర[33]

అగ్నిని, సూర్యచంద్రులని
దేవతలను భక్తితో ఆరాధించాను
పవిత్రనదులలో స్నానమాచరించాను
ఎన్నో పూజలు వ్రతాలు చేసాను
నేలపై పడుకొన్నాను
రాత్రిపూట ఉపవాసం ఉండేదానను

మరోపక్క
ఆభరణాలు ధరిస్తూ,
సుగంధద్రవ్యాలు పూసుకొంటూ
శరీరానికి తైలమర్ధనాలు చేయించుకొంటూ
విషయభోగాసక్తిని త్యజించలేదు

కాస్తంత వెచ్చదనం కొరకు

ఒక పడకనుండి మరొక పడకకు
మారుతూండేదానిని.
ఆ బంధాలు తాత్కాలికం
అతను అధికారం చూపితేనో
నాకు ఆసక్తి చచ్చిపోతేనో
పుటుక్కున తెగిపోయేవి

ఎప్పుడైతే బుద్ధుని సంఘంలో చేరానో
ఎప్పుడైతే ఈ దేహ నిజస్వరూపాన్ని దర్శించానో
కోర్కెలు, వాంఛలు, లాలసలు అన్నీ నశించాయి
సంకెళ్ళన్నీ తెంచబడ్డాయి
హృదయం ప్రశాంతంగా ఉంది.

# మిత్తకాలి[34]

ఇంటినుంచి ఇల్లులేని సంచారంలోకి
ఎంతో నమ్మకంతో ప్రవేశించాను, కానీ
సంపదలు, పొగడ్తల పట్ల నా ఆసక్తి తగ్గలేదు
నేను దారితప్పాను
వాంఛలు నన్ను విడువలేదు
అంతిమ లక్ష్యాన్ని ఏమరచి
అల్ప సంతోషాల వెంట సంచరించాను

నా గదిలో కూర్చొని ఆలోచించాను
నేను తప్పు మార్గంపై ఉన్నానని అర్ధమైంది

జీవితం చిన్నది
వార్ధక్యం, దౌర్బల్యం ముంచుకొస్తున్నాయి
ఈ దేహం శిథిలమౌతోంది

వృధాచేసేందుకు ఇంకేమాత్రం సమయం లేదు
మనుషుల్ని జాగ్రత్తగా పరిశీలించినపుడు
వారి శరీరాలలో వారి సొంతమంటూ ఏమీ లేదని
అంతా  ఆది ధాతువుల[13] పదే పదే
పునర్వినియోగ వలయమేనని అర్ధమైంది
.
నేను పైకి లేచాను
మనో బంధనాలు తెగిపోయాయి

సంపూర్ణ జ్ఞానోదయం
బుద్ధుని బోధ సఫలమైంది

13. భూమి, నీరు, అగ్ని, గాలి అనేవి నాలుగు ఆది ధాతువులు

# సకుల[35]

నేను గృహస్తుగా ఉండేటపుడు
ఒక బిక్షుని వద్ద బుద్ధుని బోధనలు విన్నాను
ధమ్మాన్ని, స్వేచ్ఛను, నిబ్బాణ ను తెలుసుకొన్నాను

ఒకప్పుడు నేను  నాలోని భార్యకు, తల్లికి
నా సర్వస్వాన్ని ధారవోసాను.
నా భర్తకు వీడ్కోలు చెప్పటంతో
నాలోని భార్య పాత్ర ముగిసిపోయింది
నా పిల్లలకు వీడ్కోలు చెప్పటంతో
నాలోని తల్లి పాత్ర ముగిసిపోయింది

ఇక నాకు నేను మిగిలాను
శిరోముండనం కావించుకొని సన్యాసం స్వీకరించాను.
శిక్షణతో

మోహ  మద మాత్సర్యాలను పారద్రోలి
హృదయ మాలిన్యాలను తొలగించుకొని
మోక్షమార్గాన్ని ఏర్పరచుకొన్నాను

నా పూర్వజన్మలు నాకు తెలిసాయి
అగోచరమైనది స్పష్టంగా
తేటగా దృగ్గోచరమయింది

ఈ దేహం నాది కాదు
ఒక కార్యం నిమిత్తం జన్మించింది
అది ముగియగానే నశిస్తుంది
ఇపుడు నా దాహం తీరి  శాంతిగా ఉంది

# సోన[26]/శోణ

ఈ దేహం
పదిమంది పుత్రులకు జన్మనిచ్చి అలసిపోయింది,
వార్ధక్యం మీదపడింది
ఒక భిక్షుణిని కలిసాను

ఆమె నాకు ధమ్మ, పంచస్కంధాలు[14]
ఆయతనాలు[15], ఆది ధాతువుల గురించి
బోధించింది
ఆమె బోధనలు విని శిరోముండనం గావించుకొని
సన్యసించాను

14. ఒక వ్యక్తి అస్తిత్వం – రూపం, వేదన (feelings), సంజ్ఞ, సంస్కారం, విజ్ఞానం అనే అయిదు స్కంధాల సముదాయం.
15. కన్ను, చెవి, నాలుక, కాయం/చర్మం, ముక్కు, మనస్సు. అనే ఆరు ఇంద్రియాలను లోపలి ఆయతనాలు అంటారు.

ఆమె శిక్షణలో  గతజన్మల ఎరుక నాకు కలిగింది
హృదయ మాలిన్యమంతా తొలగిపోయింది
నేను స్పష్టపడ్డాను, స్వేచ్ఛనొందాను...
సంపూర్ణ స్వేచ్ఛను

పంచస్కంధాలను అర్ధం చేసుకొన్నాను
వాటిమూలాలను తొలగించినా నిలబడే ఉన్నాను

వార్ధక్యమా!
నువ్విక వెళ్ళిపోవచ్చు
నేను జన్మరాహిత్యాన్ని పొందాను

## భద్ధ కుండలకేశ[37]

శిరోముండనం గావించుకొని
దుమ్ముపట్టిన దుస్తులు ధరించి
తప్పులు లేనిచోట తప్పులు ఉన్నాయని
తప్పులు ఉన్నచోట వాటికి అంధురాలినై
సంచరించేదానిని

యాభై ఐదేండ్లపాటు
అంగ, మగధ, వజ్జి, కాశి, కోశల రాజ్యాల
నలుమూలలా పర్యటించాను
ఆ రాజ్య ప్రజలు ఇచ్చిన భిక్షను తిన్నాను

ఒకనాడు
నిర్మలమైన బుద్ధభగవానుడు శిష్యులతో కలసి వుండగా
గృధ్రకూటపర్వతం వద్ద చూసాను

ఎదురుగా మోకాళ్లపై కూర్చొని
చేతులు జోడించి భక్తితో నమస్కరించాను

"రా భద్దా" అన్నారాయన
ఆ క్షణమే నా ధమ్మ దీక్షా స్వీకారం జరిగింది

తథాగతుడు ఇచ్చిన వస్త్రాన్ని ధరించిన భద్ధ
అన్ని బంధనాలనుంచి విముక్తమయింది.

# పటాచార[38]

పొలాలను నాగళ్ళతో దున్ని
విత్తనాలు జల్లి, పంటలు పండించి
భార్యా పిల్లలను పోషించుకొంటూ యవ్వనస్తులు
సంపదలతో సంతోషంగా జీవిస్తారు

మంచి పనులే చేస్తున్నాను
గురువు చెప్పిన మాటలు పాటిస్తున్నాను
సోమరిని, గర్విష్టిని కానే కాను
మరి నా పంట ఎప్పుడు పండుతుంది?

కాళ్ళు కడుక్కొన్నపుడు  నీటిని గమనించాను
అవి దొర్లుకొంటూ పల్లానికి పరుగులు తీస్తున్నాయి
నా మనస్సులోలోతుల్లోకి  తరచి చూసుకొన్నాను
నా మనసును కూడా అలా ఒదిలేసాను

అది కూడా దొర్లుకొంటూ నా కుటీరం వైపుకు
పరుగులు తీసింది

ఒక దీపం తీసుకొని నా కుటీరంలోకి వెళ్లాను
చాపపై కూర్చున్నాను
సూదితో  వత్తిని వెలుపలకి లాగాను
దీపం ఆరిపోయింది
నా మనస్సు కూడా విముక్తమయింది

# చంద[39]

ఒకప్పుడు నేను చాలా పేదరాలిని, విధవను,
సంతానము, బంధువులు, స్నేహితులు లేరు.
తిండిలేదు, సరైన దుస్తులు లేవు.
భిక్షా పాత్ర, చేతకర్ర ధరించి ఇల్లిల్లూ తిరుగుతూ
చలిలో, గాడ్పులలో ఏడేళ్ళపాటు బిచ్చమెత్తుకొని జీవించాను.

ఒకనాడొక  భిక్షుణిని చూసి
నాకు దీక్ష ఇవ్వమని అడిగాను
నా కథ చెప్పాను ఆమె నాతో కలిసి ఏడ్చింది
ఆమె తన కథ చెప్పింది  నేను ఆమెతో కలిసి ఏడ్చాను
ఆమె పేరు పటాచార

నన్నామె ఆదరించింది.
నాపై కరుణ చూపి

గొప్ప జీవిత ధ్యేయం వైపు నడిపించింది.

నేను ఆమె బోధనలు శ్రద్ధగా విన్నాను, ఆచరించాను
ఇక ఏ మాలిన్యమూ నా హృదయాన్ని తాకలేదు.

# అయిదువందల థేరీలతో పటాచార[40]

“అయ్యో నా కుమారుడా” అని మీరు
పుత్రశోకంతో రోదిస్తున్నారు
వచ్చింది ఎవరో, పోయింది ఎవరో మీకు తెలియదు
ఎక్కడి నుంచి వచ్చాడో ఎవరికీ తెలియదు

ఇదంతా మానవ దుఃఖం
దీన్ని అర్ధం చేసుకొంటే
అతను రావటం పోవటం గురించి మీరు బాధపడరు.

మీరు అడగకుండా అతను వచ్చాడు
మీతో చెప్పకుండా వెళ్ళిపోయాడు
మీరు చెయ్యగలిగింది ఏమీ లేదు
ఎక్కడినుంచో ఇక్కడకు వచ్చాడు,

కొద్దిరోజులున్నాడు
ఒక దారిలో వచ్చి మరోదారిలో వెళ్ళిపోయాడు
వచ్చాడు వెళ్ళాడు. ఇందులో బాధపడటానికి ఏముందీ?

(ఈ మాటలు విన్న తరువాత పుత్రులను కోల్పోయిన ఆ స్త్రీలు
ఇలా అనుకొన్నారు)

ఆమె నా గుండెల్లో గుచ్చుకొన్న బాణాన్ని
నా పుత్రశోకాన్ని బయటకు లాగేసింది
నిన్నటివరకూ ఆ శోకం నన్ను కబళించింది
నేడు అది పోయింది.
నేను విముక్తమయ్యాను
బౌద్ధ ధర్మాన్ని, సంఘాన్ని ఆశ్రయించి
జ్ఞానమార్గంలో జీవిస్తాను

# వాసెట్టి[41]

పుత్రవియోగంచే గాయపడ్డాను
ఉన్మత్తనై విచక్షణ కోల్పోయాను
జడలు కట్టిన జుట్టుతో దిశమొలగా
గమ్యం లేకుండా సంచరించాను

స్మశానాలలో, రహదారులపక్కన
చెత్తకుప్పలపై నిద్రించేదానను
దాహంతో, ఆకలితో మూడేళ్ళు
అలా పరిభ్రమించాను

ఒకరోజు మిథిలానగరం లో
వశపడని వాటిని మచ్చిక చేయగలిగే వాడు
జ్ఞాని, ధీర చిత్తుడు అయిన బుద్ధభగవానుని చూసాను

ఒక స్వరం వినిపించింది
అది నన్నొక చేదను చేసి
చీకటి నూతి లోతుల్లోంచి  పైకి లేపింది

ఒక్కసారిగా నాకు కనువిప్పు కలిగింది
ఆయనకు వందనమిడి ఎదురుగా కూర్చున్నాను
నాపై దయతో ధమ్మమార్గాన్ని బోధించారాయన
ఆ మాటలు వినినంతనే సన్యసించి
ఆచరించటం మొదలుపెట్టాను
జీవితంలో మొదటి సారిగా
కాంతినిండిన స్థితిని పొందాను

నా అన్ని శోకాలు ముగిసాయి
దుఃఖ మూలాలు నాకు  అర్థమయ్యాయి.
ఇప్పటికీ నన్ను కొంతమంది అడుగుతారు
పుత్రవియోగాన్ని తట్టుకోవటం బాధాకరం కదా అని
అవును అది బాధ కలిగించేదే
పుత్రజననం లాగే

బాధకి ఎన్నడూ భయపడకూడదు.

## ఖేమా[42]

[మార:]
రా... ఖేమా... రా!
మనిద్దరం యవ్వనంలో ఉన్నాం
కలిసి సుఖిద్దాం... రా!
ఒక యుగళ గీతంలా ప్రకాశిద్దాం.

[ఖేమా:]
ఈ రుజాగ్రస్త  దేహంపట్ల
విరక్తితో ఉన్నాను నేను
దైహిక సుఖాలపై ఆసక్తి లేదు నాకు

ఇంద్రియ సౌఖ్యాలు
ఈ దేహాన్ని, ఈ హృదయాన్ని నిత్యం

కత్తుల్లా ఖండిస్తాయి
నువ్వు ఆనందం అని చెప్పేదేదీ
నాకు ఆనందం కాదు

నన్ను కమ్మిన పెంజీకట్లు తొలగిపోయాయి
ఓ మారా!
నిన్ను కూడా జయించాను నేను.

సత్యాన్ని గ్రహించక
నేను కూడా ఒకనాడు అగ్నిని పూజించాను
నక్షత్రాల గమనాన్ని, రాశిఫలాలను విశ్వసించాను
అవేవీ నమ్మదగినవి కాదని అర్ధమైంది
నా అజ్ఞానం తెలిమంచులా తొలగిపోయింది

పురుషోత్తముడైన తథాగతుని
బోధనలను పాటించి
మానవ దుఃఖం నుండి సంపూర్ణంగా
విముక్తి చెందాను నేను.

# సుజాత[43]

అన్నిరోజుల్లాగే ఆరోజు కూడా మొదలైంది
చక్కని దుస్తులు ధరించాం, అల్పాహారాలు తిన్నాం
పానీయాలు,  తినుబండారాలు మూటగట్టుకొని
బృందావనానికి వ్యాహ్యాళికి బయలుదేరాం
అంజన వనాన్ని దాటేసమయంలో
"ఆరామాన్ని దర్శించటానికి రా" అని ఎవరిదో
పిలుపు వినిపించింది

తలుపు తెరిచాం
అక్కడ ఆయన
నాకెలా తెలిసింది?
ఆ కళ్ళు

మౌనంగా ఎదురుగా కూర్చొన్నాను

ఆయన ధమ్మను బోధిస్తున్నాడు
నువ్వే
సిద్ధంగా ఉన్నావా మరి?

అన్నిరోజుల్లాగే ఈ రోజు కూడా మొదలయ్యిందా?

# అనుపమ[44]

గొప్ప సంపన్న కుటుంబంలో జన్మించాను
ప్రముఖ వ్యాపారి మజ్జ ముద్దుల కుమార్తెను
అపురూప సౌందర్యరాశిని నేను
పేరుకు తగినట్లు ఉపమానరహితను

ఎందరో రాకుమారులు నన్ను వలచారు
వణిజ పుత్రులు నాపై మరులు కొన్నారు

"అనుపమ తూనికకు ఎనిమిది రెట్లు బంగారము రత్నాలు
శుల్కంగా ఇస్తాను, నాకు ఇచ్చి పెండ్లి చేయండి"
అని ఒకరు వార్త పంపించారు.

ఒకనాడు నేను సర్వోన్నతుడు, మహాజ్ఞాని అయిన
బుద్ధభగవానుని చూసాను

ఆయన పాదాలకు నమస్కరించి ఒక పక్కగా కూర్చొన్నాను

కరుణతో ఆయన నాకు ధమ్మమార్గాన్ని బోధించారు
నేను నా సాధనలో మూడవ దశను[16] చేరుకొన్నాను

శిరోముండనం గావించుకొని సన్యసించాను
కోర్కెలను జయించి  నేటికి ఏడవ రోజు

16. సాధనలో పురోగతిని బట్టి సోతాపన్న (Stream Enterer), సకదాగామి (ఒకే ఒక జన్మ కలిగిఉండటం Once-returner), అనాగామి (ఈ లోకంలో కాక, ఉన్నత లోకాలలో పుట్టి అక్కడినుండే ముక్తుడు కావటం) అర్హంత (జీవన్ముక్తి పొందటం Arahant) అనేవి నాలుగు దశలు

# ప్రజాపతి గౌతమి[45]

ఎందరికో దుఃఖవిమోచనం కలిగించిన
తథాగతునికి నమోస్తుతులు

అన్ని దుఃఖాలు
వాటి మూలాలు అర్ధమయ్యాయి
వాంఛలు నశించాయి
అష్టాంగమార్గం[17] తెరుచుకొంది
అన్నీ నిశ్చలమైన దశను చేరుకొన్నాను

17. నిర్వాణాన్ని చేర్చే బౌద్ధ మార్గం. ఇందులో ఎనిమిది అంశాలు ఉన్నాయి. 1.సమ్యక్ దృష్ఠ – భ్రమ పడకుండా ఉన్నది ఉన్నట్లుగా చూడగలగడం 2. సమ్యక్ సంకల్పము – సరియైన ఆలోచనలు. 3.సమ్యక్ వచనము. నొప్పించకుండా, వక్రీకరించకుండా, సత్యం మాట్లాడడం. 4.సమ్యక్ కర్మము– హాని కలిగించే పనులు చేయకుండుట 5. సమ్యక్ జీవనము – సరియైన వృత్తి. 6. సమ్యక్ సాధన ప్రగతి కోసం మంచి ప్రయత్నం చేయుట 7. సమ్యక్ స్మృతి – ఎల్లవేళలా ఎరుకతో, గమనికతో ఉండటం 8. సమ్యక్ సమాధి – సరియైన ఏకాగ్రత

నేను తల్లిని
కొడుకుని
తండ్రిని
సోదరుడిని
అమ్మమ్మను
ఎన్నో జన్మలు గతించిపోయాయి
సత్యం బోధపడలేదు

బుద్ధభగవానుని దర్శించాను
ఇదే నా చివరి జన్మ
జరామరణాలనుండి విముక్తమయ్యాను

ఈ శిష్యులను చూడండి
ఎంత క్రమశిక్షణతో, దృఢచిత్తులై
నిష్కళంకమైన సాధన చేస్తున్నారో!
అదే కదా తథాగతునికి ఇవ్వగలిగే నివేదన

దుఃఖితుల, రుజాగ్రస్తుల వేదనలను పారద్రోలేందుకే
మహామాయ
గౌతమునకు జన్మనిచ్చింది

# విజయ[46]

అందరూ ధ్యానం చేస్తున్నారు
నేను మాత్రం ధ్యానమందిరం వెలుపల.
ఇప్పటికే నాలుగైదు సార్లు నేను
ఆశ్రమాన్ని విడిచి పారిపోయాను
మనసు స్వాధీనంలో లేదు

చివరకు వెళ్ళి నా వైఫల్యాన్ని అంగీకరించాను
నేను పనికిరానని చెప్పేసాను

నా గురువు నవ్వింది

ప్రయత్నం ఆపకు
కక్ష్యలో ఏదీ శాశ్వతంగా ఉండదు
నీకు నచ్చిన అంశాలనే అనుచరించు' అన్నది.

ఆమె నాకు
భూమి నీరు, అగ్ని, వాయువుల గురించి చెప్పింది
నాలుగు సత్యాలను అర్థంచేయించింది
అష్టాంగమార్గం విశదీకరించింది
ఆమె బోధనలలోని సారాన్ని గ్రహించాను

ఏడు రోజుల అనంతరం
నన్ను కమ్మిన పెంజీకట్లు తొలగిపోయాయి
ఎల్లెడలా కాంతి
శాంతి

## చాల/కాల[47]

[చాల:]
నేను భిక్షుణిని
జాగురూకతతో స్థిరచిత్తనై ఉండేలా
శిక్షణ పొందాను
ఒక బాణంలా శాంతిని చేరుకొన్నాను
దేహము, మనసు నిశ్చలమయ్యాయి
ఇదే గొప్ప ఆనంద స్థితి

[మార:]
శిరోముండనం కావించుకొమ్మని ఎవరు చెప్పారు?
నీవొక విరాగిని వలె ఉన్నావు
ఇతర భిక్షుణిలతో నువ్వు కలవటం లేదు
ఎందుకు ఇదంతా నీకు?

[ చాల:]
మార్గానికి వెలుపల ఉన్నవారు
అభిప్రాయాలపై ఆధారపడతారు
వారికి ధమ్మ అంటే నిజమైన అవగాహన ఉండదు
శాక్యవంశంలో జన్మించిన బుద్ధభగవానుడు
అభిప్రాయాలను అధిగమించే మార్గాన్ని
నాకు బోధించాడు
దుఃఖం,
దుఃఖ కారణం
దుఃఖ నిరోధం
అన్ని దుఃఖాలను శమింపచేసే
అష్టాంగ మార్గం

ఆయన మాటలు విని
పులకించిపోయాను
తేవిజ్జలను అభ్యసించాను
బుద్ధుని బోధ సఫలమైంది

దైహిక వాంఛలు నశించాయి
పెంజీకట్లు తొలగిపోయాయి
ఓ మారా!
నిన్ను కూడా జయించాను నేను

## ఉపచాల

మా అక్క అనంతరం నేను ఇల్లు విడిచాను
ఆమె గుహను ఎంచుకొంది
నేను సంఘాన్ని
మధ్యమను కదా అందరి మధ్యలో ఉండాలి

ఒక్కోసారి నా హృదయం అడుగుతూ ఉంటుంది
ఉపచాలా! ఎందుకు మధ్యదానవు అయ్యావూ?
ఏ విషయంలోనైనా
మొదటిదానవు కాలేవు, చివరి దానవూ కాలేవు.

మా కథలు ఇలా ఉంటాయి
మొదటి కథ
రెండవ కథ
మూడవ కథ అంటో

మార్గం, మార్గంపై నా ప్రయాణం
నాకు ప్రత్యేకతను ఇస్తుందని
భావించాను

నీ కథను చెప్పాలనుకొంటే
నువ్వెలా స్వేచ్ఛనొందావో చెప్పు
అది నీకు మాత్రమే ప్రత్యేకమైనది.

# శిశూపచాల

చిత్తశుద్ధి కలిగిన భిక్షిణికి
ఎన్నటికీ  ఎడతెగని జీవజలంలాంటి
శాంతి లభిస్తుంది

[ మార: ]
ఇంద్రుడు అధిపతిగా ఉన్న తావతింస[18] స్వర్గంలో
ముప్పై ముగ్గురు దేవతలు ఉన్నారు
వారికి ఏ దుఃఖమూ అంటదు
వారికి నిత్యం ఆనందమే,
సుఖసంతోషాలలో తేలుతూ

18. Tavatimsa Heaven – బౌద్ధమతం చెప్పిన స్వర్గం.  దీనికి అధిపతి ఇంద్రుడు

ఇతరులు సృష్టించిన దానిని అనుభవిస్తూంటారు
అలాంటి స్వర్గ సుఖాలపై నీ  దృష్టి  సారించు

[ శిశూపచాల: ]
ఇంద్రుడు అధిపతిగా ఉన్న స్వర్గంలోని
ముప్ఫై ముగ్గురు దేవతలకు
దుఃఖం లేకపోవచ్చు
నిత్యానందమే జీవనం కావొచ్చు
ఇతరుల సంపదను సుఖిస్తూ
స్వేచ్ఛాజీవనం సాగించవచ్చు
కానీ
వారు జీవన్ముక్తులు కారు
జరామరణ వలయంలోనే పరిభ్రమిస్తూన్నారు

ఈ ప్రపంచంతా మంటల్లో ఉంది
ఈ ప్రపంచమంతా జ్వలిస్తోంది
ఈ ప్రపంచమంతా తగలబడుతోన్నది
ఈ ప్రపంచమంతా అనిశ్చితిలో ఉంది

మాకు బుద్ధభగవానుడు బోధించిన
ధమ్మమార్గం నిశ్చలమైనది
దానితో పోల్చదగినది మరేదీ లేదు
సామాన్య జనులు ఆ బోధనలను పాటించరు

కానీ నేను దృష్టినిలిపి సాధన చేసాను
తథాగతుని మాటలు వినినంతనే
అపూర్వమైన అలౌకిక ఆనందాన్ని పొందాను
తేవిజ్జలను అభ్యసించాను
బుద్ధుని బోధ సఫలమైంది

దైహిక వాంఛలు నశించాయి
పెంజీకట్లు తొలగిపోయాయి
నిన్ను కూడా జయించాను నేను

# వద్దమాత[48]

నాకు బాగా చిన్నప్పుడు
మా అమ్మ సన్యసించింది

శిరోముండనం గావించుకొని
ముతక దుస్తుల్లో అందవికారంగా
ఉన్నందుకు నాకు కోపం వచ్చింది.

చాలా ఏళ్ల తరువాత ఒకసారి వచ్చింది

అవే దుస్తులు, అదే బోడితల
కానీ ఎందుకో చాలా అందంగా అనిపించింది

నన్ను దగ్గరకు తీసుకొని ఇలా అన్నది
"ఈ ప్రపంచంపట్ల మోహాన్ని పెంచుకోకు

దుఃఖాన్ని పదే పదే ఆహ్వానించకు
కోర్కెలను జయించిన జ్ఞానులు
సంతోషంగా జీవిస్తున్నారు
గుర్తుపెట్టుకో నా చిట్టితండ్రీ!
పథం మాత్రమే ఉంది,
మరేమీ కాదు"

మరలా వెళిపోయింది

ఆ రోజునుంచి పథం నా లో పెరగటం తెలిసేది
ఒక్కోసారి కాళ్లతో తన్నుతూ, గిచ్చుతూ
సడిచెయక నిద్రిస్తూ, కూనిరాగాలు తీస్తూ
నాలో పథం ఎదుగుతూ రావటం నాకు తెలిసేది.
ఒకరోజు నాలో పెరిగిపోయిన పథాన్ని ఇక ఎంతమాత్రమూ
ఇముడ్చుకోలేక
నేను పగిలిపోతాననిపించింది
కళ్లు తెరచి చూసాను
ఎదురుగా మా అమ్మ ఉంది

వచ్చేస్తుంది... వచ్చేస్తుంది
కొద్దిగా ఓర్చుకో.

నువ్వు పథాన్ని మోస్తున్నావా

పథం నిన్ను మోస్తున్నదా

చివరకు
సమయం వచ్చినపుడు
చివరి సారిగా..

నీలో అంతశక్తి ఉన్నట్లు
నువ్వా ఊహించి ఉండవు

# కిసగౌతమి[49]

(కిసగౌతమి బుద్ధభగవానుడు సాంగత్యంలో తాను ఏం పొందిందో గుర్తుచేసుకొంటున్నది)

ఒకనాడు శాక్యముని ఇలా అన్నాడు
“లోకంలో ఎక్కడైనా
సజ్జనుల సాంగత్యంతో
అవివేకి కూడా పండితుడు కాగలడు
సన్మిత్రుల సాంగత్యంలో
బుద్ధి వికసిస్తుంది
అట్టి వ్యక్తులు
దుఃఖం నుండి విమోచన పొందుతారు

దుఃఖాన్ని,
దుఃఖ కారణాన్ని
దుఃఖ నిరోధాన్ని
అష్టాంగమార్గాన్ని
అర్థం చేసుకోవాలి

[ కిసగౌతమి:]
స్త్రీగా ఉండటమే ఒక దుఃఖం
భర్తను మరోస్త్రీతో పంచుకోవటం దుఃఖం
బిడ్డకు జన్మనివ్వటం కొందరికి దుఃఖం
కొందరు పురిటిలో చనిపోతారు
మరికొందరు
నిర్వేదంతో  బలవన్మరణాల పాలౌతారు

*[పటాచార కథ చెబుతున్నది కిసాగౌతమి]*

పురుటి కొరకు పుట్టింటికి వెళుతున్నప్పుడు
దారి మధ్యలో భర్త చనిపోయాడు
త్రోవ పక్కనే ప్రసవం జరిగింది
పుట్టిన ఊరికి చేరుకోనేలేదు మార్గమధ్యలో
ఇద్దరు కొడుకులు కూడా చనిపోయారు
ఇంటికి చేరుకొనే సరికి
నాన్న, అమ్మ, సోదరుడు
చనిపోయి  చితిపై కాలుతున్నారు

*[మరొక భిక్షుణి పటాచారతో ఇలా అంటున్నది]*

ఓ అభాగ్యురాలా!
నీ కుటుంబం చితికిపోయింది

నీ దుఃఖం కొలవలేనిది
నీ కన్నీళ్ళు ఓ వేయి జన్మలెత్తినా తరగవు

*[కిసగౌతమి ఇలా అంటున్నది ]*

పటాచార స్మశానంలో తన బిడ్డలను
నక్కలు పీక్కుతినటం చూసింది
కుటుంబాన్ని కోల్పోయింది
భర్త చనిపోయాడు
బంధువులు వదిలివేసారు
చివరకు
దేనికైతే మృత్యువు ఉండదో దాన్ని చేరుకొంది ఆమె

నేను కూడా అష్టాంగ మార్గాన్ని అనుసరించి
దేనికైతే మృత్యువు ఉండదో దాన్ని చేరుకొన్నాను
నిబ్బాణను సాధించాను
ధమ్మకు ప్రతిబింబంలా నిలిచాను

బాణం తొలగింది
భారం దించుకొన్నాను
ఏది జరగాలో అది జరిగింది

భిక్షుణి కిసగౌతమి ఈ మాటలు
అంతఃకరణ శుద్ధితో చెప్పింది.

# ఉత్పలవణ్ణ[50]

I

మా అమ్మా, నేను
ఒక పురుషునికే భార్యలమని
ఒకరోజు తెలుసుకొన్నాం
నేను భయకంపితురాలనైనాను
తల్లి కూతురులను సవతులుగా జీవింపచేసిన
దైహిక వాంఛలు ఒక్కసారిగా
క్షుద్రమైనవిగా, మలినకరంగా కనిపించసాగాయి
సుఖాలు ప్రమాదకరం
సన్యసించటం సరైన మార్గం
రాజగృహ వెళ్ళి
ఆరామవాసం స్వీకరించాను

II

ఇప్పుడు నేను
ఆరు అతీంద్రీయశక్తుల లోకంలో[19] ప్రవేశించాను
నా పూర్వజన్మల ఎరుక కలిగింది
నా దృష్టి దివ్యత్వాన్ని పొందింది
నా శ్రవణం స్ఫుటితపడింది
ఇతరుల మనసు గ్రహించగలుగుతున్నాను
గొప్ప మానవాతీత  శక్తులను సాధించాను
లోపలనుంచి జనించే తీవ్రవాంఛలను జయించాను
బుద్ధుని బోధనలు సఫలమైనాయి

III

నా శక్తులు చూపటం కోసం
శూన్యం లోంచి నాలుగు గుర్రాల రధాన్ని సృష్టించాను
వేరెవరూ పూజించనంతగా నేను
బుద్ధభగవానుని పాదాలను సేవిస్తూ
ఆయన సన్నిధిలోనే నిలిచి ఉన్నాను.

IV

[మార :]
విరగపూచిన సాల వృక్షము క్రింద

19. Chalabhinna : ఆరు అతింద్రీయ శక్తులు. 1. ఇద్ధి (సిద్ధి) శక్తులను పొందటం 2. దివ్యశవణం 3. దివ్యదృష్టి 4. పరచిత్తజ్ఞానం 5. పూర్వజన్మలను స్మరించటం 6. చిత్తమలినాలు నశించాయని తెలుసుకోవటం.

ఏ తోడూ లేక ఒంటరిగా నిలుచున్నావు
తుంటరి యువకులంటే నీకు భయం లేదా?

[ ఉత్పలవణ్ణ:]
ఓ మారా!
నీవంటి వారు లక్షమంది వచ్చినా
నేను ఏ మాత్రమూ చలించను
నువ్వేమీ చేయలేవు నన్ను?

[ మార:]
నేను సూక్ష్మరూపం ధరించి
నీ దేహంలోకి ప్రవేశిస్తాను
నీకు కనిపించకుండా
నీ కనుబొమల మధ్య నిలుస్తాను
అపుడు నువ్వు నన్ను ఎన్నటికీ చూడలేవు

[ ఉత్పలవణ్ణ:]
నేను నా మనసుపై నియంత్రణ సాధించాను
ఆరు అతీంద్రీయశక్తులను అందుకొన్నాను
బుద్ధుని బోధనలు సఫలమయ్యాయి

ఇంద్రియ సుఖాలు కత్తులు శూలాల వంటివి
ఈ దేహం, మనస్సులను అవి నిత్యం ఖండిస్తూంటాయి

నువ్వు వేటిని సుఖాలంటున్నావో
అవి నన్ను ఆకర్షించవు
అవి నాకు సుఖాలు కావు
ఎందుకంటే
నా హృదయంలోని మృత్యువు
పెనుచీకట్లు తొలగిపోయాయి
ఓ మారా! విను
నిన్ను కూడా జయించాను నేను

# పున్నిక[51]

[పున్నిక:]
నేను నీళ్ళు మోసే దాసిని
యజమానురాలి తిట్లకు, శిక్షలకు భయపడి
ఎంతచలిలోనైనా నేను నదిలో దిగకతప్పదు
ఓ బ్రాహ్మణుడా!
కాళ్ళుచేతులు వణికే ఇంతచలిలో
నీవు దేనికి భయపడి నీటిలో మునుగుతున్నావు?

[ఉదకసుద్ధిక:]
పున్నికా! నీకు అన్నీ తెలుసు
నదీస్నానం సర్వపాపాలను హరిస్తుంది
దుష్కర్మలనుండి విముక్తులను చేస్తుంది

[పున్నిక:]
నీటిలో మునిగితే
పాపవిముక్తి జరుగుతుందని ఎవరన్నారు?
ఒక అంధుడు మరొక అంధునికి దారిచూపినట్లు.
అదే నిజమైతే
కప్పలు, తాబేళ్ళు, నీటిపాములు, మొసళ్లు లాంటి
జలచరాలన్నీ స్వర్గార్హత పొందిన పుణ్యజీవులేనా!.
జంతువులను వధించేవారు, వలలు వేసేవారు,
ఉచ్చులు పన్నేవారు, దొంగలు, హంతకులు, దుర్మార్గులు
ఈ నీరు నెత్తిపై చల్లుకొంటే వారి వారి పాపాలు తొలగి
పుణ్యాత్ములౌతారా?
ఈ నీటికే పాపాలను తొలగించే శక్తే ఉంటే
పుణ్యాలను కూడా తీసుకుపోగలదు కదా!
అప్పుడు నీవు రెండిటినుండి విముక్తుడవు అవుతావు.
పాపభీతితో ఎముకలు కొరికే చలిలో స్నానం చేస్తూ
నీ శరీరాన్ని కష్టపెట్టుకోకు

[ఉదకసుద్ధిక:]
వనితా!
నేను తప్పు మార్గంలో వెళుతున్నాను
నీవు నన్ను ఉత్తమ మార్గం లోకి మళ్ళించావు
ఈ వస్త్రాన్ని నీకు ఇస్తున్నాను, స్వీకరించు

[పున్నిక:]
వస్త్రాన్ని నీవే ఉంచుకో, నాకు అవసరం లేదు.
దుఃఖం అంటే భయం ఉన్నప్పుడు
దుష్కర్మలు చేయవద్దు చీకట్లోనైనా లేదా వెలుగులోనైనా
చెడ్డపనులు చేసి వాటినుంచి పారిపోయినప్పటికీ
వాని తాలూకు దుఃఖం నుంచి తప్పించుకోలేవు.
దుఃఖం నుండి విముక్తి పొందాలంటే
తథాగతుడిని, ధమ్మాన్ని, సంఘాన్ని ఆశ్రయించు
ఉపదేశాలను ఆచరించు. మంచి జరుగుతుంది.

[ఉదకసుద్ధిక:]
తథాగతుడిని, ధమ్మాన్ని, సంఘాన్ని ఆశ్రయించాను
ఉపదేశాలను ఆచరించాను. మంచి జరిగింది.

ఒకప్పుడు నేను బ్రాహ్మణసంతానాన్ని మాత్రమే
నేనీనాడు త్రివిద్యలను అభ్యసించి పరిశుద్ధుడనైన
నిజమైన బ్రాహ్మణుడను.

## ఆమ్రపాలి[52]

ఒకప్పుడు నా కురులు
గండుతుమ్మెదల రంగులో నల్లగా, ఒత్తుగా ఉండేవి
నేడు
జనపనార వలె వడిలిపోయి ఉన్నాయి
ఒకప్పుడు నా కొప్పునిండా పూలుండేవి
తలంతా సుగంధ పేటికలా పరిమళాలు చిందేది
నేడు
కుందేలు ఉన్నివలే దుర్గంధమోడుతోంది
ఒకప్పుడు నా కనుబొమలు
నెలవంకల వలే కాంతులీనుతూ ఉండేవి
నేడు
అవి వాలి, ముడుతలు పడి ఉన్నాయి.
ఒకప్పుడు నా కనులు
వజ్రాలవలే తళుక్కుమంటూ మెరిసేవి

నేడు
అవి ఎవరినీ వెనక్కి తిరిగి చూసేలా చేయటం లేదు
ఒకప్పుడు నా గొంతు
తోటలో సంచరించే కోయిల వలే ఉండేది
నేడు
బీటలుతీసి, పెళుసు బారి
నా వయసును స్పష్టంగా పలికిస్తూ ఉంది
ఒకప్పుడు నా వక్షోజాలు
అందంగా, ఉన్నతంగా గుండ్రంగా ఉండేవి
నేడు
అవి ఖాళీ తోలు సంచుల్లా వేలాడుతున్నాయి
ఒకప్పుడు నా పాదాలు
మెత్తని దూది కూరినట్లు మృదువుగా ఉండేవి
నేడు
అవి పగుళ్ళుతీసి పుచ్చిపోయాయి

చూసావుగా నా దేహం ఎలాగ శిథిలమైందో
నేడు ఇది
బాధలు వసించే చోటు
పెచ్చులు రాలిపోతున్న
ఒక జీర్ణ గృహం

సత్యాన్ని పలికేవాని బోధనలు ఇవి

# రోహిణి[53]

[రోహిణి తండ్రి:]

తల్లీ!
నిన్నొకమాట అడగాలి
నీవు అనునిత్యం సన్యాసుల గురించే మాట్లాడుతున్నావు
వారిని మాత్రమే కీర్తిస్తున్నావు

నీవు సన్యాసులకు ప్రతిరోజు భిక్షమొసగుతున్నావు
నీకు సన్యాసులంటే ఎందుకు అంత ఇష్టం?
నీవుకూడా ఆ మార్గంలో వెళ్ళాలనుకొంటున్నావా?

వాళ్ళు పనిచేయటానికి ఇష్టపడరు, బద్ధకస్తులు
ఇతరులు ఇచ్చినదానిపై ఆధారపడి జీవిస్తారు
ఆశాపరులు, భోజనప్రియులు

సన్యాసులపై నీ ఇష్టానికి కారణమేమిటి?

[ రోహిణి: ] చేసిన సంభాషణను గుర్తుచేసుకొంటూ

తండ్రిగారు!
మీరు చాన్నాళ్ళుగా పరిత్యాగుల  గురించి అడుగుతున్నారు.
వారి జ్ఞానం, సుగుణాలు, సాధనల గురించి నేను చెబుతాను

వారు సోమరులు కాదు, పనిమంతులు
ఉత్తమమైన పనులుచేస్తున్నారు
వారు కోర్కెలను జయించారు
అందుకే పరిత్యాగులు నాకు ప్రియమైనవారు

దుఃఖకారణమైన రాగ, ద్వేష, మోహాలను నాశనం చేసారు
పవిత్రమైనదే వారు చేస్తారు
వారినుండి అన్ని చెడులు తొలగించబడ్డాయి
అందుకే పరిత్యాగులు నాకు ప్రియమైనవారు

వారి కర్మలు నిర్మలమైనవి
వారి వాక్కు నిర్మలమైనది
వారి మనస్సు నిర్మలమైనది
అందుకే పరిత్యాగులు నాకు ప్రియమైనవారు

పులుకడిగిన ముత్యంలా వారు దోషరహితులు
ఉత్తమ విషయాలు నింపుకొని
బయటాలోపలా వారు పరిశుద్ధులు
అందుకే పరిత్యాగులు నాకు ప్రియమైనవారు

బుద్ధుని బోధనలను
వారు హృదయంలోకి ఇంకించుకొన్నారు
వాటినే బోధిస్తారు, ఎంతో ఇష్టంగా, మనఃపూర్వకంగా
అందుకే పరిత్యాగులు నాకు ప్రియమైనవారు

వారు నిత్యం జ్ఞానబోధనలు వల్లించుకొంటూ
అనేక దూరాలు ప్రయాణిస్తూంటారు
వారికి దుఃఖనాశనం తెలుసు
అందుకే పరిత్యాగులు నాకు ప్రియమైనవారు

వారి సంచారజీవనంలో ఏ గ్రామాన్నైనా
నిర్మోహంతో విడిచి అనురాగరహితులై
ముందుకుసాగుతారు
అందుకే పరిత్యాగులు నాకు ప్రియమైనవారు

వారికంటూ ఏ సంపదా కూడగట్టుకోరు
వారు బంగారు, వెండి నాణాలేవీ స్వీకరించరు
గాదెలలో, కుండలలో, పాత్రలలో దాచుకొనేదేమీ ఉండదు

భిక్షకొరకు నిత్య అన్వేషణ వారిది
అందుకే పరిత్యాగులు నాకు ప్రియమైనవారు

సంఘంలో భిన్నప్రాంతాలనుంచి,
భిన్న నేపథ్యాలనుంచి వచ్చినవారు ఉంటారు
వారు  స్నేహపూర్వకంగా సహజీవనం చేస్తారు
అందుకే పరిత్యాగులు నాకు ప్రియమైనవారు

(తండ్రిచెప్పినవిషయాలను గుర్తుచేసుకొంటూ)
[ రోహిణి తండ్రి:]

రోహిణీ! నా ప్రియపుత్రికా!
నువ్వు మనకుటుంబంలో కారణజన్మురాలవు

నీకు బుద్ధభగవానుడిపై విశ్వాసముంది
ధమ్మానికి, సంఘానికి నీవు అంకితమైనావు
అలా ఉండటంలో ఔన్నత్యం ఉందని నీ నమ్మకం
ఈ పరిత్యాగులకు మన కాన్కలు కూడా అందచేయి
దుఃఖానికి భయపడితే నీవిచ్చే కాన్కలు నిష్ఫలం

[ రోహిణి:] చేసిన సంభాషణను గుర్తుచేసుకొంటూ

తథాగతునిలో, అతని ధమ్మలో, సంఘలో

నీవు కూడా రక్షణపొందు
నీ నైతికవిలువలను నీవే నిర్మించుకో!

[ రోహిణి తండ్రి:]

తథాగతుడిని, ధమ్మాన్ని, సంఘాన్ని ఆశ్రయించాను
ఉపదేశాలను ఆచరించాను. మంచి జరిగింది.
నేను బ్రాహ్మణ కుటుంబంలో పుట్టి ఉండవచ్చు
ఈరోజు త్రివిద్యలను అభ్యసించి
నిజమైన బ్రాహ్మణుడనైనాను.

# కాప /చాప[54]

[ కాల: ]
ఒకప్పుడు నేను దండం చేత ధరించిన సన్యాసిని
నేడు జింకల వేటగాడిని
నా కోర్కెల కారణంగా  ఈ  కూపంలో కూరుకుపోయాను
అవతలి తీరాన్ని చేరలేకున్నాను
నేను తనని ప్రేమిస్తున్నాను అనుకొంటుంది కాప
ఆమె నా బిడ్డను సంతోషపెడుతుంది
నేను మాత్రం ఆమెతో బంధాన్ని తెగతెంపులు చేసుకొని
తిరిగి సన్యసించాలని భావిస్తున్నాను.

[ కాప: ]
పెద్దమనిషి, నాపై కోపం చూపకు!
మహాతపస్వీ, నాపై కోపం చూపకు!
నీ కోపం నిన్ను నడిపిస్తున్నపుడు

మనసు నిర్మలంగా ఉండదు
నీపై నీకు నియంత్రణ ఉండదు

[ కాల: ]
నేను వెళ్ళిపోవాలనుకొంటున్నాను
Nala లో ఎవరు ఉండాలనుకొంటారు?
ఇక్కడ నిష్టకలిగిన సన్యాసులకు తమ దేహాలను
ఎరగావేసి వలలో వేసుకొంటారు స్త్రీలు .

[ కాప: ]
కాలా వెళ్ళిపోకు!
రా! నా ప్రేమను పొందు
నేను నీకు బానిసనై ఉంటాను
నా బంధువులందరూ కూడా

[ కాల: ]
కాపా! నీవు మాట్లాడుతున్న దానిలో
ఏ కొద్దిపాటి నిజమున్నా
నీ సహచరి స్వర్గం అనుభవించేవాడు
అవన్నీ అసత్యాలు.

[ కాప: ]
అలాగే కాలా!

నేను కొండ అంచుపై
పూతకొచ్చిన మద్ది చెట్టు లాంటిదానను
విరగకాచిన పుల్లని ద్రాక్షతీగను
ద్వీపాంతర్గతంలో వికసించిన పాటలీ పుష్పాన్ని
నా దేహమంతా స్వర్ణ చందనం పూయబడింది
వారణాసి పలుచని దుస్తులు ధరించాను
నేను అందగత్తెను
నన్నెందుకు విడిచిపెడుతున్నావు?

[ కాల: ]
నువ్వు పక్షులకు ఉచ్చులు బిగించేదానవు
నీ అందమైన దేహంతో
నన్ను ఇంక ఏమాత్రమూ బంధించలేవు

[ కాప:]
కాలా, కానీ
ఈ శిశువు అనే ఫలం నీది
నేను నీ శిశువుని కలిగి ఉండగా నన్ను ఎలా
విడిచి వెళ్ళగలవు?

[ కాల: ]
జ్ఞానులు బిడ్డలను, బంధువులను,
సంపదలను త్యజించి ముందుకు సాగుతారు

శృంఖలాలు తెంచుకొన్న ఏనుగు వలె

[ కాప:]
అలాగైతే
నీ కొడుకును మురికిలోపడవేస్తాను
కత్రతో, కత్తితో గాయపరుస్తాను
ఆ బాధలో నీవు మమ్మల్ని విడిచి వెళ్లలేవు.

[ కాల: ]
ఓసి పిచ్చిదానా!
నువ్వు నా బిడ్డని నక్కలకు, కుక్కలకు
ఆహారంగా వేసేసినా
నేను వెనక్కి తిరిగేది లేదు.

[ కాప:]
అయితే ఇదే నా వీడ్కోలు కాల
ఎక్కడకు వెళతావు?
గ్రామం, పట్టణం, నగరం, రాజధాని?

[ కాల: ]
ఒకప్పుడు మాకు అనుచరులు ఉండేవారు
గ్రామాలు, పట్టణాలు, రాజధానులు సంచరించేవాళ్లం.
అప్పుడు మేము సన్యాసులము

ఇప్పుడు కాదు.
నేరంజర నది వద్ద బుద్ధభగవానుడు ధమ్మ మార్గాన్ని
బోధిస్తున్నాడట.
నేను ఆయనవద్దకు వెళతాను.
ఆయనే నా బోధకుడు.

[ కాప:]
ప్రపంచ మార్గదర్శి అయిన
ఆయనకు నా అభివాదాలు తెలియచేయి
నాకొరకు ప్రార్థన చేయి.

[ కాల: ]
అవును నిజమే కాప!
ఆయన ప్రపంచానికి మార్గదర్శి
ఆయనకు నీ వందనాలు తెలియచేస్తాను
నీ కొరకు నివేదన చేస్తాను



కాల అలా నేరంజర నది వద్దకు వెళ్ళగా
అక్కడ  నిర్వాణం, దుఃఖం, దుఃఖాంతం,
అన్ని దుఃఖాలను నివారించే అష్టాంగమార్గం  గురించి
జ్ఞానోదయం పొందినవాడు తేనెలొలుకు స్వరంతో
బోధిస్తుండగా దర్శించుకొన్నాడు.

ఆ తథాగతుని కాళ్లకు  నమస్కరించి
చుట్టూ ప్రదక్షణ చేసి ఆ ఫలాన్ని
కాప  నివేదనగా సమర్పించుకొని
సన్యాసాన్ని స్వీకరించి త్రివిద్యలను అభ్యసించాడు.

బుద్ధుని బోధనలు సఫలమైనాయి

# సుందరి[55]

ఈ గాథ వివిధ పాత్రలతో ఒక నాటకాన్ని తలపిస్తుంది.

పాత్రలు

సుందరి (గాథానాయకి)

సుజాతు (సుందరి తండ్రి, బ్రాహ్మణుడు)

వాసెట్టి (వృద్ధ భిక్షుణి)

సుందరి తల్లి

సుజాతు వద్ద పనిచేసే రథం తోలేవ్యక్తి

సుందరి గురువు

శ్రావస్తిలో పాదచారి

బుద్ధభగవానుడు

ఇతివృత్తం

సుజాతుకు పుత్రశోకం కలుగుతుంది. బౌద్ధ భిక్షుణి వాసెట్టిని కలిసి తన దుఃఖం గురించి చెప్పుకొంటాడు. ఆమె బుద్ధభగవానుని

దర్శించమని సలహా ఇస్తుంది.  తథాగతుడిని దర్శించి  సుజాతు సన్యాసం స్వీకరిస్తాడు.  ఇది చూసిన సుజాతు వద్ద పనిచేసే రథకారుడు కూడా బౌద్ధదీక్ష తీసుకొంటాడు. సోదరుడు చనిపోయిన దుఃఖాన్ని అధిగమించటం కొరకు సుందరి కూడా ఆరామవాసినిగా మారుతుంది. ఒకనాడు ఆమె బుద్ధభగవానుని ముందు తన సాధనను ప్రదర్శించి ఆయన అనుగ్రహానికి పాత్రురాలు అవుతుంది.

[సుజాతు:]
ఓ తల్లీ!
నీ ఏడుగురు బిడ్డలను పురిటిలోనే కోల్పోయావు
నష్టజాతకురాలవని అందరూ నిందించారు
ఒకప్పుడు నీబిడ్డలను తలచుకొంటూ
రేయింబవళ్ళూ దుఃఖించేదానవు.
ఓ బ్రాహ్మణ వనితా!
ఈ రోజు నీకు పుత్రశోకం లేదు
నీవెలా ఉపశమనం పొందావు?

[వాసెట్టి:]
ఓ బ్రాహ్మణుడా!
గతంలో వందలకొలదీ బిడ్డలు మరణించారు
నీ బిడ్డలు, నా బిడ్డలు
ఈరోజున కూడా నేను అదే మనిషిని
కానీ ఈ చావు పుట్టుకల నుండి స్వేచ్ఛనొందాను
నాకు దుఃఖం లేదు నేను శోకించను

[సుజాతు:]
నీ మాటలు ఆశ్చర్యకరం, అద్భుతం
వాసెట్టి, ఎవరి బోధనల వల్ల
నీవు ఇలా ఆలోచించగలుగుతున్నావు?

[వాసెట్టి:]
బుద్ధభగవానుడు.
మిథిలానగరంలో ఆయన చేస్తున్న ధమ్మబోధనలు
సకల జనులకు అన్ని బాధలను అంతమొందిస్తాయి
ఓ బ్రాహ్మణుడా!
అర్హంతుని బోధనలు విని
పునర్జన్మకు హేతువు లేదనే సత్యం తెలుసుకొని
వెనక్కి లాగే బంధనాలనుండి విముక్తినొంది
పుత్రులపట్ల నా దుఃఖాన్ని పారద్రోలాను.

[సుజాతు:]
నేను మిథిలానగరం వెళతాను
బుద్ధభగవానుడు నా శోకాన్ని కడతేర్చుతాడని
ఆశిస్తున్నాను

[గాథాకారుడు:]
ఆ బ్రాహ్మణుడు జన్మరాహిత్యం, దుఃఖాతీత స్థితిని సాధించిన తథాగతుని దర్శించుకొన్నాడు. ఆయన ద్వారా దుఃఖాన్ని, దుఃఖ కారణాన్ని దుఃఖ నిరోధాన్ని అష్టాంగమార్గాన్ని తెలుసుకొన్నాడు.

ధమ్మమార్గాన్ని తెలుసుకొన్న ఆనందంలో వెంటనే సన్యసించి మూడు రాత్రులలో త్రివిద్యలను అభ్యసించాడు.

[సుజాతు:]
రథకారుడా!
నీవు రథాన్ని తీసుకొని ఇంటికి వెళ్ళు
ఈ బ్రాహ్మణుడు సన్యసించాడని బ్రాహ్మణికి చెప్పు
చాలామందికి తెలియని త్రివిద్యలను
అందుకొన్నాడని తెలుపు.

[సుందరి తల్లి:]
రథకారుడా!
నా భర్త త్రివిద్యలను సాధించిన
శుభవార్త తీసుకొచ్చినందుకు
నీకు ఈ అశ్వం, రథం,
వెయ్యిబంగారు నాణాలను బహుమతిగా
ఇస్తున్నాను  స్వీకరించు.

[రథకారుడు:]
తల్లీ!
నేను కూడా గొప్ప జ్ఞాని సన్నిధిలో ఉండటానికి
సన్యసించాలనుకొంటున్నాను.
ఈ అశ్వం, రథం, బంగారాన్ని స్వీకరించలేను.

[సుందరి తల్లి:]
సుందరీ!
ఈ ఏనుగులు, ఆవులు, గుర్రాలు,
మణిమాణిక్యాలు, సకల సంపదలను త్యజించి
మీ తండ్రిగారు సన్యసించారు
ఈ సంపదలకు నువ్వే వారసురాలివి
వీటిని అనుభవించు

[సుందరి:]
నా తండ్రి పుత్రశోకం నుండి విముక్తి పొందటానికి
సన్యసించాడు
ఈ ఏనుగులు, ఆవులు, గుర్రాలు,
మణిమాణిక్యాలు, సకల సంపదలను త్యజించి.
నా సోదరుని మరణం పట్ల నాకు కూడా శోకం ఉంది
నేను కూడా సన్యసించాలనుకొంటున్నాను

[సుందరి తల్లి:]
నువ్వు కోరుకొన్నదే జరుగుగాక!
కట్టుకునేందుకు ఒక జీర్ణవస్త్రము
ఇతరులు దయతో ఇచ్చే బిక్షా
అంతకు మించి నీకు ఇంకేం కావాలి
హృదయంలోని కల్మషాలనుండి విముక్తి చెంది
జన్మరాహిత్యాన్ని పొందుతావు

[సుందరి తన భోధకురాలితో:]
జ్ఞానం మూర్తీభవించిన థేరీ
నీవు సంఘానికి ఒక ఆభరణం
నీ బోధనలద్వారా నాకు
నా పూర్వజన్మలు నాకు తెలిసాయి
అగోచరమైనది స్పష్టంగా
తేటగా దృగ్గోచరమయింది
తేవిజ్జలను అభ్యసించాను
బుద్ధుని బోధ సఫలమైంది

శ్రావస్తి వెళ్ళటానికి అనుమతినివ్వండి
అక్కడ బుద్ధభగవానుడి సమక్షంలో
మీరు నేర్పిన విషయాలను
గొప్పవిశ్వాసంతో ప్రకటిస్తాను

[సుందరి బోధకురాలు:]
సుందరీ!
వెళ్ళు, వెళ్ళి
వశపడని వాటిని మచ్చిక చేయగలిగే వాడు
స్వర్ణకాంతులతో ప్రకాశించే గొప్ప జ్ఞాని
ధీరచిత్తుడు  అయిన బుద్ధభగవానుని దర్శించుకో
[శ్రావస్తిలో ఒక పాదచారి:]
చూడు! సుందరి వస్తున్నది.
కోర్కెలనుండి సంపూర్ణంగా స్వేచ్ఛనొందింది

జన్మరాహిత్యం సాధించింది
ఏ బంధనాలు లేని విముక్త ఆమె
ఆమె జీవితం సఫలం

[సుందరి  తథాగతునితో:]
నేను మీ శిష్యురాలు, సుందరిని
మీ దర్శనం కొరకు కాశి నుంచి వచ్చాను
తథాగతా! బోధకుడా!
నేను మీ పుత్రికను
మీ వాక్కునుంచి పుట్టిన మీ నిజమైన పుత్రికను
నేనీనాడు కల్మషరహితను, విముక్తను

[తథాగతుడు:]
స్వాగతం, భాగ్యశాలీ స్వాగతం
తమని తాము వశపరచుకొని
విముక్తమైన వారికిలాగే
నీకు కూడా  గమ్యం ఇదే
నీవీనాడు ఏ బంధనాలు లేని విముక్తవు
నీ జీవితం సఫలం

# శుభ: స్వర్ణకారుని కూతురు[56]

నా చిన్నప్పుడు అందమైన దుస్తులు వేసుకొనేదానను
ఒకనాడు ధమ్మమార్గం తెలుసుకొన్నాను
అప్పటినుంచి ఇంద్రియభోగాలపై  ఆసక్తి పోయింది
యవ్వనవతిగా పుష్పించాకా నా దేహం భయపెట్టేది
దాని వాంఛల నుండి స్వేచ్ఛనొందటానికి సన్యసించాను
నా బంధుగణాన్ని, సేవకులని, శ్రామికులని
ఇండ్లు, పొలాలు, సంపదలు సర్వస్వాన్ని త్యజించాను
ధమ్మమార్గంలో విశ్వాసం ఉంచి ముందుకు సాగుతున్నాను

ప్రియ స్వజనులారా!
నిబద్ధతతో ధమ్మమార్గంలో నడుస్తున్న నన్ను తిరిగి
గృహస్థమార్గంలోకి ఆహ్వానిస్తున్నారు
నేను త్యజించిన వెండి, బంగారాలను
తిరిగి స్వీకరించమని కోరుతున్నారు

ఆ పని నేను చేయలేను, ఎందుకంటే

వెండి, బంగారాలు
జాగృతిని,  శాంతిని ఇవ్వవు
పరిత్యాగులకు అవి పనికిరావు
అవి ఉత్తమసంపదలు కావు

వెండి, బంగారాలు అంటే
దురాశ, మత్తు, మాయ, సంకెళ్ళు
కష్టాలు, అనుమానం, సమస్యలు

వెండి బంగారాలలో స్థిరత్వం లేదు
నష్టం, దుఃఖం, విపత్తు, విలాపం
ఎన్నో అనర్థాలు ఉన్నాయి
ఎందరో పురుషులు యుద్ధాలు చేసుకొన్నారు
ఒకరినొకరు చంపుకొన్నారు

ప్రియ స్వజనులారా!
నన్ను ఎందుకు ఇంద్రియసుఖాలకు
కట్టబెట్టాలని చూస్తున్నారు?
నడవాల్సిన మార్గంలో నడక ఆరంభించేసాను నేను
నన్నిక ఏ సంపదలు వెనక్కు మళ్ళించలేవు
ఇంద్రియలోలత్వం  శత్రువు, హంతకి,

నా ప్రియ స్వజనులారా!
మీరు చూస్తున్నారుగా,
నేను కేశఖంధనం కావించుకొని
కాషాయ దుస్తులు ధరించి
భిక్షను స్వీకరించి ఆరామజీవనం సాగిస్తున్నాను
ఇదే నాకు సరైనది.

గొప్ప దార్శనికులు ఇంద్రియాలను తిరస్కరించారు
వారు స్వేచ్ఛ, శాంతి, ఆనందం పొందారు

చాలామంది ఇంద్రియలోలత్వం అనే ఊబిలో
తమకు తెలియకుండానే కూరుకుపోయి
చావుపుటుకల మర్మాన్ని తెలుసుకోలేరు
ఇదంతా మార పన్నాగం
ఈ బంధనాలను తెంచుకోవటం నాకు ఆనందం
ఇంద్రియలోలత్వంతో యుద్ధం చెయటం నాకు సంతోషం
గొప్ప దార్శనికులు నడిచిన అష్టాంగమార్గంలో నడుస్తాను
స్వజనులారా
నన్ను నా మార్గాన సాగనివ్వండి

[ బుద్ధభగవానుని మాటలు: ]
స్వర్ణకారుని కుమార్తె అయిన శుభను చూడండి
ధమ్మలో స్థిరంగా నిలిచి, ధ్యానం చేస్తున్నది

ఇది ఎనిమిదో రోజు
ఉత్పలవణ్ణ వద్ద సాధన నేర్చుకొన్నది
త్రివిద్యలను సాధించింది
అన్ని బంధాలనుండి విముక్తమయింది
వెనక్కు లాగే అన్ని శక్తుల నుండి స్వేచ్ఛనొందింది

# శుభ[57]

శుభ ఒక సంపన్న బ్రాహ్మణ కుటుంబంలో జన్మించిన అమ్మాయి. గొప్ప అందగత్తె. యుక్తవయసులో బౌద్ధ దీక్ష తీసుకొని తక్కువ కాలంలోనే గొప్ప జ్ఞానం పొంది వివేచన కలిగిన భిక్షుణిగా పేరుతెచ్చుకొన్నది. ఒకనాడు ఆమె ఒంటరిగా అడవిలో సంచరిస్తున్నప్పుడు కామాతురుడైన ఒక అందమైన యువకుడు ఎదురై ఆమెను నిలువరించాడు. అప్పుడు వారి మధ్య జరిగిన సంభాషణ.

[శుభ: ]
ఎవరవోయి నీవు? నేను నీకేమి చేసాను?
ఎందుకు నాదారికి అడ్డు పడుతున్నావు?
ఒంటరిగా ఉన్న అమ్మాయిని తాకటం సరి కాదు
నేను పవిత్రంగా ఉన్నాను, ఏ కళంకమూ లేదు
మా రక్షకుడు, బోధకురాలు నన్ను తీర్చిదిద్దిన విధానమది.

నీ బుద్ధి మంచిగా లేదు, కోర్కెతో రగిలిపోతోంది
నేను నిర్మలంగా ఉన్నాను
నాకు ఏ వాంఛలూ లేవు
తేటగా ఉన్నాను
నా మార్గానికి అడ్డుగా ఎందుకున్నావు?

[ యువకుడు: ]
నువ్వు అందగత్తెవు, అమాయకంగా ఉన్నావు
నీ కాషాయ వస్త్రాలను విడిచిపెట్టు
మనిద్దరం ఈ అడవిలో విహరిద్దాం
గాలి తియ్యగా ఉంది
అడవంతా పుష్పించింది
తరువులు పుప్పొడి వెదచల్లుతున్నాయి
వసంత రుతువు ఆనందాలకు నెలవు
ఏ తోడూ లేక  ఈ వన సంచారం ఏం సుఖం నీకు?
చుట్టూ మృగాలు
మగ ఏనుగులచే ఉద్రేకించబడిన
ఆడఏనుగుల ఘీంకారాలు
భయం వేయటం లేదా?

నీవు నాతో వచ్చేయి
నీకొరకు పెద్ద భవంతి నిర్మిస్తాను
బంగారము, రత్నాలు, ముత్యాలతో

సేవకులు నిన్ను అలంకరిస్తారు
గంధపుచెక్కతో చేసిన  తల్పంపై పవళించగ రా
రా... నన్ను అంగీకరించు...

[శుభ: ]
ఈ దుర్భలదేహంలో మృత్యువు ఉంది
దీనిలో నిన్ను ఆకర్షించినదేమిటీ?
ఈ దేహాన్ని ఎందుకు తదేకంగా
చూస్తున్నావు?

[ యువకుడు: ]
నీ నేత్రాలు...   మృగనయనీ...   నీ నేత్రాలు!
అవి  ప్రకాశించే నీలి కలువలు
వాటిని చూస్తే  నీపై నా ప్రేమ అతిశయిస్తుంది
నీవు నిష్క్రమించినా
నీ కనులను, నీ కనుబొమలను, నీ చూపులను
స్మరించుకొంటూనే ఉంటాను
నీ నేత్రాలను మించినవేవీ లేవీ లోకంలో

[శుభ: ]
బుద్ధభగవానుడి పుత్రికను నీవు వాంఛిస్తున్నావు
ఇది తప్పు మార్గము
నాకు ఏ కోర్కెలు లేవు

కోర్కెలు అంటే ఏమిటో కూడా నాకు తెలియదు ఇప్పుడు
కోరుకోవటానికి అర్హతకలిగినది ఏదీ కనిపించదు నాకు
నేను అష్టాంగమార్గంలో సాగుతున్నాను
ఈ మార్గం వెలుపల ఉన్నవారినెవరినైనా ఎంచుకో నన్ను కాదు
అంధుడా!
నీవు లేని వస్తువుల వెంటపడుతున్నావు

నేత్రాలు అనేవి
గుంటల్లో ఉండే చిన్న చిన్న గోళాలు
కన్నీళ్ళు, శ్లేష్మం నిండిన బంతులు

(అని చెప్పి ఆమె తన కంటిని బలవంతంగా పెకలించి అతని
చేతిలో పెట్టి ఇలా అన్నది)

నీవు ఎంతో ప్రేమించిన
నా నేత్రం ఇదిగో! తీసుకో, ఇది ఇక నీదే!

(ఊహించని ఈ సంఘటనకు చలించిపోయిన ఆ యువకుడు
పశ్చాత్తాపం పొంది క్షమించమని ఆమెను కోరాడు)

[ యువకుడు: ]
పవిత్రమైన భిక్షుణీ!
దయచేసి నీవు నీ పూర్వరూపాన్ని పొందు

నన్ను మన్నించు.
ఇకపై ఇలా ఎన్నడూ జరగదు
దయచేసి నీవు  నీ పూర్వరూపాన్ని పొందు
నన్ను మన్నించు.

(పిదప శుభ తధాగతుని వద్దకు వెళ్ళగా అతని చూపులు ఆమెపై ప్రసరించగానే ఆమెకు నేత్రము తిరిగి పూర్వస్థితికి వచ్చింది.)

# ఇసిదాసి[58]

నేను ప్రతిరోజు నా అత్తమామల పాదాలను
కళ్ళకద్దుకొని దినచర్య ప్రారంభించే దానిని
నా భర్త తరపువాళ్ళను చూడగానే
ఒణికిపోతూ లేచి  నా స్థానాన్ని వారికి ఇచ్చేదానిని
వారికి నచ్చిన రుచికరమైన వంటకాలు వండిపెట్టేదానిని

ఉదయాన్నే నిద్రలేచి,
నా భర్తకు తలదువ్వి, అలంకరించేదానిని
స్వయంగా ఒండిన అన్నాన్ని తినిపించేదానను
తల్లి బిడ్డను సాకినట్లు  నా భర్తను సాకేదానిని

ఇన్ని చేసినా నా భర్తకు నేను నచ్చలేదు
ఇసిదాసితో కలిసి ఉండలేను అని నన్ను
మా పుట్టింటికి పంపించివేసాడు.

కొడుకుని పొందాను కానీ సౌభాగ్యాన్ని కోల్పోయాను

నా తండ్రి భారీ కట్నకానుకలిచ్చి
మరో ధనికుడైన వ్యాపారితో నాకు రెండో పెళ్ళి చేసాడు
ఇతను కూడా ఒక నెల కాపురం చేసి
నన్ను మా పుట్టింటికి పంపించివేసాడు

మా ఇంటికి భిక్షకు వచ్చిన ఒక సన్యాసికిచ్చి
నాకు మూడో పెళ్ళిచేసాడు మా తండ్రి
ఇతను కూడా ఒక నెల కాపురం చేసి
ఇసిదాసి తో కలిసి ఉండలేను అని నన్ను విడిచి వెళ్ళిపోయాడు.

ఇంత జరిగాక నేను చనిపోదామని నిశ్చయించుకొన్నాను

ఒక రోజు మా ఇంటికి జ్ఞానవంతురాలైన ఒక భిక్షుణి వచ్చింది
ఆమె బోధనలతో నేను ఆధ్యాత్మిక మార్గాన్ని తెలుసుకొని
దీక్ష తీసుకొని ధమ్మమార్గంలో ప్రయాణిస్తున్నాను.

# సుమేధ[59]

ధమ్మ గురించి మొదటిసారిగా విన్న ఆ రోజున
తెల్లని దుస్తులు ధరించి ఉన్నాను
ఎవరో పిలుస్తున్నట్లు అనిపించింది
కానీ పోల్చుకోలేకపోయాను

నా గదిలో
ఒంటరిగా నాతోనేను
ఎక్కువసేపు గడిపేదానిని

ఒకరోజు అమ్మ అడిగింది
ఏంజరుగుతుంది, ఎందుకిలా ఉంటున్నావు అని
అప్పుడు నేను ఆమెతో జరిగింది చెప్పాను

“బుద్ధుని మార్గంలో నడవటం అంత సులభం కాదు

మరీ ముఖ్యంగా విలాసవంతమైన జీవితం గడిపేవారికి”
అమ్మ అన్నది
ఇంకా
“అనికదత్తుని పెండ్లాడు
యువతులందరూ సుఖించినట్లే సుఖించు
మంచి బట్టలు
విరహపు ఎదురుచూపులు
ఖరీదైన విందు వినోదాలు
పెళ్ళిళ్ళు పేరంటాలు”

“ఈ దేహాన్ని అలంకరించి వివాహం అనే బంధంలో
అమ్ముకోమంటున్నావా?
అలా కాకపోయినా ఏదో ఒకనాడు ఈ దేహాన్ని
ఏ వెలా లేకుండా స్మశానానికి అమ్ముకోవాల్సి వస్తుందిలే”

ఇంద్రియసుఖాలను కోరుకొనే మనం అందరం
గొడ్డలిని వెతుక్కునే  పశువులం
పాముకోరలను వెతుక్కొనే మెత్తని మాంసం ముద్దలం
మంటను వెతుక్కొనే ఎండు గడ్డిపరకలం
మన ప్రతిబింబాలను వెతుక్కొనే ప్రేమికులం

అమ్మా
నడిచే ఆహారం మనం

క్రిందకు ఒరిగామా
రాబందుల విందు మొదలౌతుంది

ఒక చాకు తీసుకొని
నా వెంట్రుకలను ఖండించుకోవటం
నా తల్లిదండ్రులు అలా చూస్తూ ఉండిపోయారు

[ ఇంతలో అనికదత్తు యువరాజు వచ్చాడు ]

చేతిలో చాకు
తెగిపడిన వెంట్రుకలను చూసి నవ్వుతూ ఇలా అన్నాడు
సుమేధా!
పొట్టి జుట్టుతో నువ్వు మరింత అందంగా ఉన్నావు
నిన్ను చూస్తే
రాజ్యంలోని స్త్రీలందరూ జుత్తు కత్తిరించుకొంటారు

ఇలా రా ప్రియా!
ఈ ప్రపంచం మొత్తం ఆనందం కొరకు పర్వులెడుతోంది
అదృష్టం కలిసొస్తే
పందెంలో మనమే విజేతలం కావొచ్చు.

"ఎంత మంచి ప్రభువు మీరు!
మనం బ్రతికుండగా ప్రాపంచిక విషయాల వెంటబడి

సంపాదించుకోవాల్సినవి దొంగతనం చేసుకొంటూ
కాపాడుకోవాల్సినవి తగలబెట్టుకొంటూ
ప్రేమించే వారిని నీట ముంచుతూ
మిత్రులనే శత్రువులుగా చేసుకొంటూ పరుగులు
మరణించాకా కూడా అలా పరిగెడుతూనే ఉండాలి"

నా జుత్తును పూర్తిగా ఖండించి నేలపై విడిచాను
అనికదత్తు నా తల్లిదండ్రులతో ఇలా అన్నాడు
"మీరే నా తల్లిదండ్రులుగా భావించి ఈ మాట చెబుతున్నాను
ఆమెను వెళ్ళనివ్వండి
ఆమె తన మార్గాన్ని తానే అన్వేషించుకోనివ్వండి
ఏదో ఒకరోజు ఆమె తిరిగి వచ్చి
మనందరికి మన ఇంటికి తిరిగి వెళ్ళే దారి చూపించవచ్చు"



చీకటి పడుతోంది
సూర్యుడు అస్తమిస్తున్నాడు
మన దారులు వేరవబోతున్నాయి
కాసేపు ఇక్కడ కూర్చుందామా
ఏమీ మాట్లాడకుండా నిశ్శబ్దంగా

ఈ మార్గం ఒక పాటలాగ
సాగుతోంది

సముద్రంలో తప్పిపోయిన నావికుడు
తీరాన్ని చేరుకొన్నట్లు
నీకు కూడా గమ్యం దొరుకుతుందిలే

వినబడుతోందా?
ఆకుల మధ్య అలల సంగీతం
ముందుకు సాగు

# END NOTES

[1]బౌద్ధ సంఘంలోకి కొత్తగా చేరిన స్త్రీని సిక్ఖామాన (sikkhamana-female buddhist probationar) అంటారు. ఈమె రెండేళ్ల పాటు ఒక భిక్షుణి వద్ద శిక్షణపొందిన తరువాత భిక్షుణి దీక్ష స్వీకరించవచ్చును. ఇలా మారటానికి తల్లిదండ్రులు జీవించి ఉంటే వారి అనుమతి, భర్త ఉంటే అతని అనుమతి, దాసి అయితే యజమాని అనుమతి తప్పని సరి. అంతేకాక అప్పటికే సంఘంలో ఉండే ఇతర భిక్షుణిల అంగీకారం కూడా ఉండాలి. కుటుంబసభ్యులను అవసరం అనుకొంటే అప్పుడప్పుడు చూసిరావచ్చు. 10 ఏండ్లపాటు సంఘంలో అనుభవం గడించిన భిక్షుణిని థేరీ/వృద్ధ బిక్షుణి/ Elder Female Buddhist అంటారు. ఈమె కొత్తగా సంఘంలోకి వచ్చినవారికి శిక్షణ ఇవ్వవచ్చు.

స్త్రీలు సన్యసించి స్వేచ్ఛాసంచారజీవనం సాగించటం ఎలాపుట్టిందో వేదపూర్వ, వేదకాల రచనలలో ఎక్కడా పెద్దగా ఆధారాలు కనిపించవు. అలాగని బుద్ధుని కంటే పూర్వం స్త్రీలు ఆధ్యాత్మిక అన్వేషణలు జరపలేదని చెప్పలేం. బుద్ధునికన్నా 50 ఏండ్లు పెద్దవాడైన జైన మహావీరుడు ముప్పై ఆరువేల మంది స్త్రీలతో సంఘాన్ని నెలకొల్పాడు. వేద సంప్రదాయం/

ఆర్యసంస్కృతి (తదనంతరపు హిందూమతం) 1500 BCE నాటికి అప్పటికి మనుగడలో ఉండిన మాతృస్వామ్య సమాజాన్ని క్రమేపీ పితృస్వామ్య సమాజంగా మార్చటానికి దోహదపడింది. అంతవరకూ వేదాధ్యయనం చేసిన, సామాజిక ఉత్పత్తిలో పురుషులతో సమానపాత్ర వహించిన, వేదకాండలను నిర్వహిస్తూ, విదుషీమణులుగా, కవయిత్రులుగా, గణనీయమైన పాత్రపోషించిన స్త్రీలను కట్టడి చేసి పురుషాధిక్య చట్రంలో ఉంచటం మొదలైంది. ఆర్యసంస్కృతి స్త్రీలనే కాక శూద్రులను కూడా జ్ఞానానికి (సంస్కృతానికి) దూరంగా ఉంచింది. వీరికి వేదవిద్యలు నేర్పాలా వద్దా అంటూ అతిప్రాచీన ఆపస్తంబధర్మసూత్ర, జైమిని మిమాంశ సూత్రలో అపసూద్రాధికరణ పేరిటా; ఆ తదుపరి ఆదిశంకరాచార్యుల నుంచి పదహారోశతాబ్దపు అప్పయ్యదీక్షితులవరకూ పండిత చర్చలు జరగటం గమనార్హం. (The Language of the Gods by Sheldon Pollock Pn.41, 42)

ఆర్యసంస్కృతి ద్వారా వెలికి గురైన స్త్రీలను, శూద్రులను మొదటగా చేరదీసింది జైనమతం. పార్శ్వనాథుడు (BCE 872 –772) స్త్రీలకు కూడా పురుషులతో సమానంగా అధ్యాత్మిక మార్గాన్ని అన్వేషించే స్వేచ్ఛ ఉందని వారు కూడా జ్ఞాన సముపార్జన చేసి గురువులుగా బోధనలు చేయవచ్చని ప్రవచించాడు. అంతే కాక స్త్రీలు అధికారిక, రాజకీయ స్థానాలకు కూడా అర్హులని చెప్పాడు. ఈ అంశాలను బౌద్ధం మరింత ముందుకు తీసుకువెళ్ళింది. బౌద్ధ, జైనాలు స్థానిక భాషలలో జ్ఞానాన్ని అందిస్తూ, శూద్రులను స్త్రీలను అక్కున చేర్చుకొన్నాయి. ఈ చర్యలన్నీ ఆర్యసంస్కృతి భావజాలానికి ప్రతిఘాతంగా పనిచేసి ఉండవచ్చు ఆకాలంలో. అదొక చారిత్రిక భావజాలవైరుధ్యం.

[2]థేరికా క్షత్రియకుటుంబంలో జన్మించింది. థేరీగా మారకమునుపే ఆమె పేరు థేరిక. ఒకనాడు ఈమె బుద్ధుని బోధనలు విని ఆకర్షితురాలై, సంఘంలో చేరాలని నిర్ణయించుకొంది. భర్త అందుకు అంగీకరించని

కారణంగా గృహస్తుగా సంసారిక బాధ్యతలు నిర్వర్తిస్తూ తథాగతుని బోధనలు మననం చేసుకొంటూ జీవనం సాగించసాగింది. ఒకనాడు వంటింట్లో మంటలు చెలరేగగా థేరికాకు ప్రాణాపాయం తప్పింది. ఆ క్షణంలో మానవ జీవితం ఎంత అశాశ్వతమో అర్థమై, భర్తను ఒప్పించి బౌద్ధ భిక్షుణిగా దీక్ష తీసుకొంది. బుద్ధుడు ఈమెతో అన్నమాటలివి.

[3]ముత్త (ముక్త) అంటే విముక్తమయిన స్త్రీ అని. థేరీ గాథలలో ముక్త పేరుతో ఇద్దరు కనిపిస్తారు. ఈ గాథలో ఉన్న ముక్త సంపన్న బ్రాహ్మణ కుటుంబానికి చెందిన స్త్రీ. ఈమె మహా పజాపతి వద్ద సన్యాసం తీసుకొన్నది. ఒకనాడు ఈమెకు స్వప్నంలో బుద్ధభగవానుడు కనిపించి పై వాక్యాలు చెప్పాడు. ఈమె ఈ వాక్యాలను విన్నవెంటనే, అర్హంత (జీవన్ముక్తి పొందటం (Arahant) స్థాయిని పొందేటపుడు, చివరగా మరణించేటపుడు మొత్తం మూడుసార్లు చెప్పిందట.

[4]ముక్తవలే పున్న (పూర్ణ) కూడా సంపన్నకుటుంబానికి చెంది, ఇరవయ్యవ ఏట మహాపజాపతి వద్ద సన్యాసం తీసుకొని గొప్ప భిక్షుణిగా పేరుతెచ్చుకొన్నది.

[5]బుద్ధభగవానుడు జన్మించిన శాక్య వంశంలోనే తిస్సా కూడా జన్మించింది. బుద్ధభగవానుడు సిద్ధార్థునిగా ఉన్నప్పుడు తిస్సా అతని అంతఃపురకాంత. మహాపజాపతి గౌతమి వద్ద తిస్సా సన్యాసం తీసుకొన్నది. బుద్ధభగవానుడు ఈ గాథను తిస్సా స్వప్నంలో దర్శనం చేయించాడు.

[6]ధర్మపాలుడు థేరీగాథలకు చేసిన వ్యాఖ్యానంలో – నాలుగు, అయిదు గాథలలో చెప్పిన తిస్సా పేరుగల థేరీలు ఇంకా ధీరా, వీర, మిత్తా, భద్ర, ఉపశమ, విశాఖలు, బుద్ధభగవానుడు సిద్ధార్థునిగా ఉన్నప్పుడు అతని అంతఃపురస్త్రీలుగా ఉండేవారని, వీరందరికీ బుద్ధుడు స్వప్నంలో కనిపించి జ్ఞానమార్గాన్ని ఉపదేశించాడని చెప్పాడు.

బుద్ధుడు సన్యసించకపూర్వం సిద్ధార్థునిగా ఉన్నప్పుడు అంతఃపురంలో అతనితో సన్నిహితంగా మెసిలిన వారిలో మొత్తం పన్నెండు మంది బౌద్ధభిక్షుణిలుగామారి ధమ్మమార్గంలో ప్రయాణించారు.

[7]రెండవ గాథలో చెప్పిన ముత్త వేరు ఈమె వేరు. ఈ ముత్త (ముక్త) ఒక పేద బ్రాహ్మణకుటుంబంలో జన్మించింది. భరించలేని పేదరికం కారణంగా తల్లిదండ్రులు ఈమెను ఒక గూనివానికిచ్చి వివాహం జరిపించారు. అనాకారితో వివాహం కన్నా వైవాహిక జీవితంలో ఎదురైన కష్టాలు ముత్తను కృశింపచేసాయి. భర్త అనుమతితీసుకొని ఆమె బౌద్ధ ఆరామంలో చేరింది. నియమనిష్టలతో జీవనం సాగించి సంఘంలో భిక్షుణి హోదాను పొందింది.

[8]ధమ్మదిన్న (Devoted to dhamma) ఒక సంపన్న కుటుంబంలో జన్మించింది. ఈమెకు ధనవంతుడైన విశాఖ అనే వ్యాపారితో వివాహమైంది. ఒకనాడు భర్త ఇంటికి తిరిగివచ్చాకా, రోజూలా కిటికీ వద్ద ఎదురుచూసే ధమ్మదిన్నను చూసి నవ్వలేదు. ధమ్మదిన్న భర్తచేయిపట్టుకొని లోనికి ఆహ్వానించింది. విశాఖ మాట్లాడలేదు, కాళ్ళు కడుక్కొని భోజనానికి కూర్చున్నాడు. వడ్డించిన ఆహారాన్ని మౌనంగా తింటున్నాడు తప్ప ఎప్పట్లాగ "రా వచ్చి కూర్చొని నాతో పాటు భుజించు" అని భార్యను పిలవలేదు. భర్తకు కోపం వచ్చిందేమోనని ధమ్మదిన్న భావించింది. భోజనం అయ్యాక, విశాఖ, ధమ్మదిన్నను పిలిచి పక్కన కూర్చోబెట్టుకొని "నేనీరోజు బుద్ధభగవానుడి బోధనలు విన్నాను, సన్యసించాలని అనుకొంటున్నాను, ఇక రేపటినుంచి ఈ సంపదలన్నీ నీవి, నీవు కావాలంటే ఇక్కడ ఉండొచ్చు లేదా మీ పుట్టింటికి వెళ్ళిపోవచ్చు" అన్నాడు. ఆ మాటలు విన్న ధమ్మదిన్న "నేను కూడా సన్యసించి కొత్తజీవితాన్ని పొందాలనుకొంటున్నాను" అని అన్నది. ఆ రోజే విశాఖ తన భార్యను బంగారు పల్లకిపై బౌద్ధ సన్యాసినులు ఉండే ఆరామానికి పంపించి తానుకూడా దీక్షతీసుకొన్నాడు. అక్కడ ధమ్మదిన్న ఎంతో శ్రద్ధతో

దీక్షతో బుద్ధుని బోధనలను నేర్చుకొని గొప్పజ్ఞానాన్ని పొందింది. కొంతకాలం తరువాత ధమ్మదిన్న తన భర్త ఉన్న ఆరామానికి వచ్చి అతన్ని కలిసింది. అప్పటికి విశాఖకు ఆరామజీవనంపట్ల పూర్వం ఉన్న ఆసక్తి పోయి సన్యాసం నుంచి మరలా గృహస్థుజీవనానికి మరలిపోదామని అనుకొంటున్నాడు. ధమ్మదిన్నను ఎందుకు ఈ సన్యాసంలో ఉండాలి? సరైన సాధన ఏమిటి? ధ్యానం అంటే ఏమిటి? అంటూ అనేక ప్రశ్నలు అడిగాడు. వాటన్నిటికీ ధమ్మదిన్న చక్కని సమాధానాలు చెప్పి నిర్వాణ అంటే ఏమిటి అని అడిగిన ప్రశ్నకు, బుద్ధభగవానుని దర్శించి ఆయనను అడగమని చెప్పటంతో, విశాఖ తథాగతుని దర్శించి జరిగినది అంతా చెప్పగా– "ధమ్మదిన్న ఇచ్చిన సమాధానాలన్నీ చక్కగా ఉన్నాయి. నేను కూడా అలాగే చెప్పి ఉండేవాడిని, ఇకపై ధమ్మదిన్న బోధనలను నానోటి నుంచి వచ్చినవాటిగా స్వీకరించండి" అని బుద్ధభగవానుడు పలికాడు. ఆ విధంగా ధమ్మదిన్న చేసిన బోధనలు "బుద్ధవచన" (the word of Buddha) లోకి ఎక్కించబడ్డాయి.

ఆనాటి సమాజంలో పురుషునితో సమానంగా స్త్రీ ఏ స్థాయిలో హోదాని పొందిందో ఈ గాథద్వారా అర్థం చేసుకొనవచ్చును. "రా వచ్చి, కూర్చుని నాతో పాటు భుజించు" అంటూ భర్త భార్యను సహపంక్తి భోజనానికి ఆహ్వానించటం; నేను సన్యసించాకా ఈ సంపదలకు వారసురాలివి నీవే, ఇష్టమైతే ఇక్కడే ఉండొచ్చు లేదా మీ పుట్టింటికి వెళిపోవచ్చు అనే ఐచ్ఛికతను ఇస్తూ ఆమె స్వేచ్ఛను గౌరవించటం స్త్రీపురుషుల ఆదర్శవంతమైన సమానత్వాన్ని ప్రతిబింబిస్తాయి. ఇంతటి పురోగమ స్త్రీపురుష సంబంధాలలోకి కాలక్రమేణా– భర్త భోజనం చేసేటపుడు విసనకర్రతో విసురుతూ అతనికి వడ్డిస్తూ, అతను భుజించాకా మిగిలిన పదార్థాలను స్వీకరించటం, సతీసహగమనం, పాతివ్రత్య మహిమ, జీవిత పర్యంతం పరాధీనగా బ్రతకటం, బాల్యవివాహాలు, పునర్వివాహ నిషేదంలాంటి దురాచారాలు ప్రవేశించటం ఒక అవాంఛనీయ చారిత్రిక పరిణామం.

[9]ఈ విశాఖ పై గాథలోని వ్యక్తి కాదు. బుద్ధభగవానుడు సిద్ధార్థునిగా ఉన్నప్పుడు అతని అంతఃపురస్త్రీ.

[10]ఈమె కూడా సిద్ధార్థుని అంతఃపురకాంత
[11]ఈమె కూడా సిద్ధార్థుని అంతఃపురకాంత

[12]ఈ గాథ థేరికా గాథ వలె ఉంటుంది. కోశల రాజైన పసేనది సోదరి సుమన. పసేనది అప్పటికే బుద్ధుని శిష్యుడు. సుమన సన్యసించాలని అనుకొన్నా, బాగోగులు చూసుకోవలసిన అమ్మమ్మ ఉన్నకారణంగా ఎప్పటికప్పుడు వాయిదా పడుతూ వచ్చేది. అమ్మమ్మ చనిపోయేనాటికి సుమనకు వయసుపైపడినా పజాపతి గౌతమి వద్ద సన్యాసం స్వీకరించింది.

[13]ధమ్మకు చక్కని కుటుంబం, భర్త, పిల్లలు ఉన్నారు. ఈమె ఒకనాడు బుద్ధుని బోధనలు విని సన్యసిస్తానని భర్తని అడిగింది. అతను అనుమతించని కారణంగా సంసారజీవనంలోనే ఉండిపోయింది. భర్తమరణించిన అనంతరం సన్యాసం స్వీకరించింది. ఒకనాడు భిక్షాటన సమయంలో ఈమెకు జ్ఞానోదయం అయినట్లు గాథ ద్వారా తెలుస్తుంది.

[14]కపిలవస్తులో శాక్యరాజవంశంలో పుట్టింది అభిరూపనంద (Pleasing Beauty). ఈమెకు యుక్తవయసు రాగానే తండ్రి స్వయంవరం ఏర్పాటు చేసాడు. ఆ స్వయంవరంలో ఈమె ఎంపిక చేసుకొన్న చారభూత అనే వ్యక్తి అనూహ్యకారణాలవల్ల ఆ రోజే మరణించటంతో, అది శుభకరం కాదనే ఉద్దేశంతో అభిరూపనంద ఇష్టానికి విరుద్ధంగా ఆమె తల్లిదండ్రులు బలవంతంగా ఆమెను సన్యసింపచేసారు. అభిరూపనందకు పెండ్లి చేసుకోవాలని ఉండేది.అయిష్టంగానే సంఘంలోచేరింది.విషయాలు తెలుసుకొన్న బుద్ధభగవానుడు ఒకరోజు అభిరూపనందను తన సమక్షానికి రమ్మని పిలిచాడు. అప్పుడు బుద్ధభగవానుడు అభిరూపనంద లాగే ఉండే ఒక ప్రతిమను సృష్టించి దాని ద్వారా వివిధ వృద్ధాప్య దశలను

ప్రదర్శింపచేయగా. అవే దశలను తన దేహం కూడా పొందబోతుందనే స్పృహతెచ్చుకొన్న అభిరూపనంద బౌద్ధ దమ్మాన్ని మనసావాచాకర్మణా ఆచరించటం మొదలుపెడుతుంది. ఆ సందర్భంగా బుద్ధభగవానుడు పలికిన పలుకులు ఈ గాథ. సుందరినంద గాథ (82–86 వచనాలు) కూడా ఇదే విధంగా ఉంటుంది.

[15]మగధలోని జెంత అనే ఊరిలో జన్మించిన కారణంగా ఈమెకు ఆ పేరు వచ్చిఉండవచ్చు. జెంతి ఒక రాజకుంటుంబ స్త్రీ. బుద్ధుని బోధనలు ఆచరించి అర్హంత స్థాయిని చేరుకొంది.

[16]సుమంగళుడు ఒక బౌద్ధ భిక్షువు. అతని తల్లి ఈ గాథాకారిణి. ఈమె ఒక బుట్టలు అల్లేవాని భార్య. సంసారజీవితంలోని నిస్సారాన్ని అద్భుతంగా ఈ గాథలో పలికించింది. ఆ గొడ్డుచాకిరీ నుండి విముక్తినొందానని చాలా బిగ్గరగా ప్రకటించుకొంది.

[17]అద్దకాశి(Half Kasi) కాశికి చెందిన ఒక సంపన్నవ్యాపారి కూతురు. ఆమె పెరిగి పెద్దయ్యాక ఒక వేశ్యగా మారుతుంది. (పూర్వజన్మలో ఒక భిక్షుణిని వ్యభిచారి అని తిట్టిన కారణంగా అలా వేశ్యగా మారవలసి వచ్చిందని ధర్మపాలుని వ్యాఖ్యానం) అప్పట్లో కాశి ప్రముఖ వ్యాపార పట్టణం. దాని ఒక రోజు ఆదాయం వెయ్యి బంగారు నాణేలు. వేశ్యగా ఈమె వెల మొదట్లో వెయ్యినాణాలుండేదట, క్రమేపీ అయిదువందల నాణేలుగా స్థిరపడటంతో ఈమెను అర్ధకాశి అని పిలిచేవారు. వయసుమీదపడిన తరువాత అర్ధకాశి బౌద్ధాన్ని స్వీకరించి జ్ఞానోదయంపొందింది.

[18]చిత్త (హృదయం) ఒక సంపన్న కుటుంబంలో జన్మించి బుద్ధుని భోధనలకు ఆకర్షితురాలై ప్రజాపతి వద్ద సన్యసించింది. ఈమె వార్ధక్యంలో ఒక కొండపైకి వెళ్ళి ధ్యానం చేసుకొంటున్న సమయంలో జ్ఞానోదయం అయింది.

[19]మిత్తా(Friend) క్షత్రియ కుటుంబంలో జన్మించింది. ఈమెకు

మహాప్రజాపతి గౌతమి దీక్ష ఇచ్చింది. కఠోర సాధనతో ఈమె అనతికాలంలోనే గొప్ప భిక్షుణిగా పేరుతెచ్చుకొంది. బౌద్ధమతంవైపు ప్రజలు ఆకర్షితులవటం ఒకరకంగా గొప్ప చారిత్రిక చిక్కుముడి. మిత్తా, నందుత్తరలు చెప్పిన ఈ గాథలు ఆ చిక్కుముడిని కొంత విప్పే ప్రయత్నం చేస్తాయి.

ఇదే మోక్షమార్గమని వైదిక ధర్మం ఎన్నో క్రతువులను నిర్ధేశించింది. ఆ మేరకు మిత్తా పర్వదినాలలో ఉపవాసాలుండేది. వాటిని పాటించకపోతే ఏమౌతుందో అనే ఆందోళన, భయం సహజం. పై గాథలో మిత్తాకు అలాంటి ఆందోళనలనుండి బౌద్ధబోధనలలో ఉపశమనం దొరికింది. నిజానికి బౌద్ధం స్వీకరించాకా ఒకపూటే తింటూ మునుపటికన్నా ఎక్కువ నిరాహారంగా ఉన్నది మిత్త. బౌద్ధం జీవన్ముక్తి పేరుతో చెప్పిన జన్మరాహిత్య భావన మిత్తలాంటి వారిని ఆకర్షించి ఉంటుంది. "పరలోకం కాదు అన్నీ ఇక్కడే" అనే ఆలోచనతో వారు బెంగ, ఆందోళనా లేని జీవనాన్ని సాగించి ఉంటారు.

[20]అభయమాత అసలు పేరు పద్మావతి. ఈమె గొప్ప అందగత్తె. ఈమె ఉజ్జయినిలో వేశ్యగా జీవనం సాగించేది. ఈమె కొడుకు పేరుఅభయ. బిడ్డల పేరుమీద తల్లి పేరు ఉండటం–సుమంగళమాత, వద్ధమాత లాంటి ఇతర గాథలలో కూడా గమనించవచ్చు. ఈమె అందం గురించి విన్న బింబిసార చక్రవర్తి ఈమెను కూడాడు. వీరిద్దరికి ఒక పుత్రుడు జన్మించాడు. పద్మావతి బింబిసారుని ద్వారా పుట్టిన తన కుమారుడు అభయునికి ఏడేండ్లు వయసు వచ్చేసరికి తండ్రివద్దకు పంపించింది. అతను అక్కడ అంతఃపురంలో పెరిగి పెద్దయి సన్యసించి బౌద్ధభిక్షువుగా జీవించసాగాడు. ఒకనాడు ఈ అభయుడు తల్లికి ఉపదేశించి ఆమెను కూడా బౌద్ధధమ్మ లోకి ఆహ్వానించిన ఉదంతాన్ని ఈ గాథ తెలుపుతుంది.

[21]ఈ గాథలోని అభయ పై గాథలో చెప్పిన అభయ ఒకరు కాదు.

ఈ అభయ పద్మావతి స్నేహితురాలు. ఈమె పద్మావతితో పాటు సన్యసించింది. Satipatthana-Suttaలో మానవదేహం మరణించాకా ఏ విధంగా కుళ్ళిపోతుందో దశలుగా వర్ణించబడింది. కొత్తగా సన్యసించిన వారిని కుళ్ళిపోతున్న శవాల మధ్య కూర్చోబెట్టి ధ్యానం చేయించే వారు. అభయ బహుశాకుళ్ళిపోతున్న మానవదేహాన్ని పరిశీలించి నా దేహమూ కూడా కొంతకాలానికి ఇంతే కదా అని వైరాగ్యాన్ని పొంది ఆధ్యాత్మిక శాంతిని పొంది ఉంటుంది

[22]సామ (Peaceful) కోసంబిలో సంపన్న కుటుంబంలో జన్మించిన అమ్మాయి. ఈమె ప్రాణస్నేహితురాలైన సామవతి అకాలంగా మరణించటంతో జీవితం పైన విరక్తి కలిగి సన్యసించింది. అక్కడి జీవితానికి అలవాటు పడలేక పారిపోతూ ఉండేది. బుద్ధుని భోధనల ద్వారా జ్ఞానోదయం పొందింది.

[23]శ్రావస్తిలో ఒక సంపన్న వడ్డీవ్యాపారస్తుని కూతురు ఉత్తమ. యవ్వనంలో ఉన్నప్పుడే పటాచార వద్ద సన్యసించింది. సతిపత్తన సూత్ర లో ఎవరైనా ఏడు సంవత్సరాలు కాని, ఏడు నెలలు కాని, ఏడు వారాలు కాని లేదా ఏడు రోజులుకానీ శ్రద్ధతో, అంకితభావంతో ధ్యానం చేస్తారో వారికి తప్పక జ్ఞానోదయం అవుతుందని బుద్ధభగవానుడు అన్నాడు.ఆ అంశాన్ని ఈ గాథ ప్రస్తావిస్తుంది.

[24]కోసల రాజు వద్ద మంత్రిగా పనిచేస్తున్న ఒక బ్రాహ్మణుని కూతురు దంతిక. ఈమె యుక్తవయసులోనే ప్రజాపతి గౌతమి వద్ద బౌద్ధదీక్ష తీసుకొన్నది. పరిపరివిధాల ప్రవహించే మనసుని స్వాధీనపరచుకోవటానికి సాధన చేయటమే మార్గమని, కఠోరసాధన ద్వారా ఎంతటి మృగప్రాయ చిత్తమైనా మచ్చికకాక తప్పదని గొప్ప దుష్టాంతంద్వారా దంతిక తన గాథలో చెప్పింది

[25]శ్రావస్తిలో పేరుగాంచిన కుటుంబానికి చెందిన స్త్రీ ఉబ్బిరి. ఆమె కూతురు జీవ. జీవ అంటే ప్రాణముతో ఉన్న అని అర్థం. కొన్నాళ్లకు జీవ చనిపోయింది. కూతురి మరణాన్ని జీర్ణించుకోలేక ఉబ్బిరి స్మశానాల చుట్టూ తిండి తిప్పలు లేక పిచ్చిపట్టిన దానివలే తిరుగుతూ ఉండేది. బుద్ధభగవానుడు బోధిస్తుండగా ఉబ్బిరి ఆ సమూహానికి వెనుక వరుసలో నిలుచుని, కూతురుని తలచుకొని ఏడుస్తూంటే, బుద్ధ భగవానుడు ఎందుకు ఏడుస్తున్నావు అని అడుగగా, నా కూతురు మరణించింది అని చెప్పిన ఆ సందర్భం ఈ గాథలో నిక్షిప్తం అయింది.

[26]రాజ గృహలో ఒక సంపన్నకుటుంబానికి చెందిన స్త్రీ సుక్క (Pure white). ఈమె చిన్నవయసులోనే ధమ్మదిన్న వద్ద దీక్ష తీసుకొన్నది. అనతికాలంలోనే నిర్వాణ స్థితిని పొందింది. ఈమె చక్కని బోధకురాలిగా పేరుతెచ్చుకొన్నది. ఈమెకు అయిదువందలమంది శిష్యులు ఉండేవారు. ఈమె భోధనలకు అందరూ మంత్రముగ్ధులైపోయేవారట. అలా ఒకరోజు రాజగృహలో ఈమె బోధిస్తుంటే చెట్టు దేవత (యక్షిణి) ప్రేరణపొంది వీధుల్లో, సంచరిస్తూ, సుక్క బోధనలను గురించి ప్రజలకు తెలియచేస్తూ, సుక్కకు కూడా సూచనలు చేయటం ఈ గాథలో గమనించవచ్చు.

[27]కాశికి పన్నెండు మైళ్ల దూరంలో ఉండే అలవి అనే ఊరిలో శైల (Firm) జన్మించింది. శైల అలవిక అనే రాజు కూతురు. ఈమె బుద్ధభగవానుని బోధనలు వినటంకొరకు తండ్రితో పాటు వెళ్ళేది. అలా కొంతకాలానికి ఈమెకూడా సన్యాసం తీసుకొని,ఇంటికి కొన్ని వందలమైళ్ల దూరంలో ఉండే శ్రావస్తిలో నివసించసాగింది. ఒకరోజు ఈమె ఒక చెట్టు క్రింద ధ్యానం చేసుకొంటున్నప్పుడు మార (మారుడు) ఈమెను ఇంద్రియ సుఖాలవైపు ఆకర్షించటానికి ప్రయత్నించగా జరిగిన సంభాషణ ఇది.

[28]బింబిసార చక్రవర్తి వద్ద పనిచేసే మంత్రి కుమార్తె సోమ (Moon).

బుద్ధుని బోధనలు విని ఒక సామాన్య వ్యక్తిగా సన్యసించి, క్రమేపీ అకుంఠిత సాధనతో అర్హాంత స్థాయిని చేరింది. ఈ గాథలో మారతో సోమ సంభాషణ ఆసక్తికరంగా ఉంటుంది. ఈ గాథ పాళి మాతృకలో వచ్చే dvangulapannaya (two-fingered wisdom) అనే మాట కీలకం. స్త్రీలు అన్నం ఉడికిందో లేదో అని రెండు వేళ్లమధ్య మెతుకుని నలిపి తెలుసుకొంటారు కనుక వారి జ్ఞానం ఆమేరకే అనటం స్త్రీల ప్రతిభాపాటవాలను తీవ్రంగా కించపరచటం. ఆధ్యాత్మిక సాధన విషయంలో తెలివితేటలు కావాలి, ఇంటిచాకిరీ చేసే నీకు ఉండవు అంటూ శైలా ఆత్మగౌరవాన్ని తక్కువ చేసినపుడు, ఆమె ధీటైన సమాధానం ఇచ్చింది. ఆనాటి స్త్రీలు సామాజికంగా ఎదుర్కొన్న సమస్యకు, ఆడమగా ఇద్దరూ సమానమే అంటూ బౌద్ధమతం చెప్పిన సమాధానంగా ఈ గాథను అర్థం చేసుకోవాలి. ఆ విధంగా స్త్రీలు పురుషులతో ఆధ్యాత్మిక విషయాలలో అప్పట్లో పోటీపడేవారని అర్థమౌతుంది. ఈ ధోరణి క్రమేపీ క్షీణించి స్త్రీలు వంటగదికి, పిల్లలు కనటానికి పరిమితమైపోవటం తరువాతి పరిణామం.

[29] భద్ధకాపిలాని (Good daughter of Kapila) ఒక బ్రాహ్మణ కుటుంబంలో జన్మించింది. ఈమె చిన్నతనంలోనే సన్యసించాలని నిశ్చయించుకొన్నది. కస్సప అనే బ్రాహ్మణ కుర్రవాడు ఈలోకంలో జీవుల కష్టాలను చూసి సన్యసించాలని అనుకొన్నాడు. వీరి తల్లిదండ్రులు పెళ్ళి ప్రయత్నాలు చేయటం మొదలుపెట్టారు. సంసారజీవితం మాకు వద్దు, మేము సన్యసించదలచుకొన్నామని చెప్పినా వినకుండా వీరిరువురికి పెండ్లిచేసారు. పెండ్లయిన తరువాత భద్ధకాపిలాని, కస్సప ఒకరి జుత్తును మరొకరు కత్తిరించుకొని, కాషాయ వస్త్రాలు ధరించి, సన్యాస దీక్ష తీసుకోవటానికి రెండు మార్గాల్లో విడివిడిగా వెళతారు. కస్సపునికి మొదటగా దీక్షలభించగా, భద్ధకాపిలానికి అయిదేళ్ల అనంతరం దీక్ష లభిస్తుంది. అనతికాలంలోనే భద్ధకాపిలాని అర్హాంత స్థాయిని చేరుకొని కొత్తగాచేరిన సన్యాసినులకు

శిక్షణ ఇచ్చేది. ఈమె ప్రేమాస్పద స్వభావానికి అందరూ ఆకర్షితులై ఎంతో గౌరవించేవారు.

భిక్షుణి విభంగ (Analysis of Nuns' Discipline) అనే బౌద్ధ రచనలో భద్ధకాపిలాని గురించిన ప్రస్తావనలురెండు సందర్భాలలో ఉన్నాయి. భద్ధకాపిలాని సహచర భిక్షుణి అయిన థుల్లనందా చాలా తెలివైనది. మంచి భోధకురాలు. భద్ధకాపిలాని ఎక్కువమంది ప్రేమాభిమానాలను, గౌరవాన్ని చూరగొనటంపట్ల థుల్లనందా అసూయచెందేది. కొన్ని సందర్భాలలో థుల్లనంద శిష్యులు కూడా భద్ధకాపిలానిని ఇష్టపడటం పట్ల మరింత రగిలిపోయేది. ఒకనాడు భద్ధకాపిలానిగది వెలుపల థుల్లనందా శిష్యులతో కలిసి కేకలు వేస్తూ అల్లరి చేసిందట. మరొక సారి భద్ధకాపిలాని శ్రావస్తి వచ్చినప్పుడు ఆమెకు ఇచ్చిన అతిథి గృహంలోకి థుల్లనందా చొరబడి ఆమె సామాన్లను బయటకు విసిరేసిందట. భద్ధకాపిలాని అర్హంత కనుక థుల్లనందా పట్ల ఏ విధమైన రాగద్వేషాలకు గురికాకుండా ప్రశాంతంగా ఉండి తన ఔన్నత్యాన్ని చాటుకొంది. ఈ రెండు సందర్భాలను ఉదహరిస్తూ భిక్షుణి విభంగ రచనలో, క్రమశిక్షణ ఉల్లంఘనలకు వివిధ శిక్షలు చెప్పబడ్డాయి. (ఈ గాథలోని కొన్ని వచనాలు ఉత్తమ థేరీగాథకు పునరుక్తి).

[30]అనామిక/అన్యతార మహాప్రజాపతి గౌతమికి సహాయకురాలు. ఈమె గౌతమి వద్ద సన్యాసం తీసుకొంది. ప్రాపంచిక విషయాలపట్ల లౌల్యంచే ఈమెకు ఇరవై ఐదేండ్లు శ్రమించినా జ్ఞానం సిద్ధించలేదు. మరొక బౌద్ధ భిక్షుణి అయిన ధమ్మదిన్న బోధనలు విన్నతరువాత ఈమె సాధన సఫలమైంది.

[31]వ్యభిచారం అనేది అతిప్రాచీన వ్యవస్థీకృత వ్యాపారం. థేరీ గాథలకు ధమ్మపాలుడు చేసిన వ్యాఖ్యానంలో ఒక వేశ్య సంపాదించిన ధనంలో సగం ఆమెకు చెందగా మిగిలిన సగం వేశ్యావాటిక నిర్వహించేవారికి

చెందుతుంది అంటాడు. దానిని బట్టి సుమారు రెండున్నరవేల సంవత్సరాల క్రితపు గణికావ్యవస్థ ఆర్థిక అంశాలు కొంతమేరకు అర్థమౌతాయి. విమల (Unsoiled) వైశాలిలో(నేటి బీహారు) నివసించే ఒక గణిక కూతురు. వేశ్యాగృహంలోనే పుట్టి పెరిగింది. ఒకనాడు ఈమె బుద్ధుని ప్రియశిష్యుడైన మొగ్గల్లాన అనే భిక్షుకుడిని చూసి అతన్ని ఆకర్షించి వశపరచుకోవాలని ప్రయత్నించింది. అతను– "నీవు చర్మం కప్పుకొన్న పెంటకుప్పవు; గడ్డల వక్షోజాలు ఉన్న దయ్యానివి; నీ నవరంధ్రాలలో దుర్వాసనా స్రావాలు ప్రవహిస్తున్నాయి; శుచిని కోరుకొనేవారు పెంటను ఎలాగైతే తప్పించుకొంటారో నీ శరీరాన్ని అలాగే తప్పించుకొంటారు" అంటూ విమలను తృణీకరిస్తాడు. అతని అవమానకరపు మాటలు విమలలోని అహంకారాన్ని చంపివేసి, ఆమెను బౌద్ధభిక్షుణిగా మారేలా చేసాయి. థేరీగా మారాక విమల వ్రాసుకొన్న గాథ ఇది. గాథలో చివరి వాక్యం ముఖ్యమైనది. అప్పుడూ ఇప్పుడూ ఒక స్త్రీని నియంత్రించే అంశాలు అవి. వాటిని బయటకు తరిమేయటం అంటే సంపూర్ణ స్వేచ్ఛ. భౌతికంగా, మానసికంగాను. అంతటి విప్లవాత్మక భావాలను నేడు వ్యక్తీకరించే పరిస్థితులు ఉన్నాయా అనేది సందేహాస్పదమే!

[32]లిచ్ఛవి రాజవంశం వద్ద సేనాధిపతిగా ఉంటున్న సిహసేనాపతి మేనకోడలు సిహా. (సివంగి) ఈమె వైశాలిలో పుట్టిపెరిగింది. సిహ సేనాపతి జైనమతావలంబకుడు. గౌతమబుద్ధుని బోధనలు విన్నాక బౌద్ధంలోకి మారాడు. సిహాకూడా సన్యాసం తీసుకొన్నది. ఏడేండ్లపాటు బౌద్ధంలో ఉన్నప్పటికీ సిహాకు ఏవిధమైన మనశ్శాంతి లభించలేదు. ఈ జీవితం పట్ల విసుగుచెంది ఆత్మహత్యచేసుకోవాలని సిద్ధపడినప్పుడు, జ్ఞానోదయమైంది.

[33]నందుత్తర (Pleasing) ఒక బ్రాహ్మణ కుటుంబంలో జన్మించింది. ఈమె మొదట జైన మతాన్ని స్వీకరించి, భద్ధకుండలికేశ వలె దేశమంతా తిరిగి ఆధ్యాత్మిక చర్చలు చేస్తూ ఎంతో మందిని ఓడించింది.. ఒకరోజు బుద్ధుని ప్రియశిష్యుడైన మొగ్గల్లానతో చర్చల్లో పాల్గొని వాదనలో ఓడిపోయి

బౌద్ధాన్ని స్వీకరించి అనతికాలంలోనే సంఘంలో గొప్ప భిక్షుణిగా పేరుతెచ్చుకొన్నది. ఈ గాథలో బౌద్ధానికి మారకముందు ఒకవైపు ఉపవాసాలు, పూజలు వ్రతాలు చేస్తూ మరోపక్క భోగలాలసత్వాన్ని విడువకుండా జీవించటంలోని కపటత్వాన్ని బట్టబయలు చేస్తుంది నందుత్తర. ఈ వ్యాఖ్య చరిత్రపరంగా ఆనాటి సమాజాన్ని అర్థం చేసుకోవటానికి దోహదపడుతుంది.

[34]మిత్తకలి (Dusky Friend) ఒక బ్రాహ్మణకుటుంబంలో జన్మించింది. బుద్ధుని బోధనలు విని చిన్నవయసులోనే సన్యసించింది. ఈమె నిర్వాణం కొరకు కాక ఇతరుల మెప్పుకొరకు జీవించిన కారణంగా ఆధ్యాత్మికంగా ముందుకు వెళ్లలేకపోయింది, జీవిత చరమాంకంలో తనమార్గం తప్పు అని తెలుసుకొని సాధనచేయటంతో పరిపూర్ణజ్ఞానం సాధించింది.

[35]సకుల శ్రావస్తిలో ఒక బ్రాహ్మణ కుటుంబంలో జన్మించింది. ఒకనాడు ఈమె జేతవనం దర్శించింది. అక్కడ బుద్ధుని భోధనలు విని సన్యాసం స్వీకరించింది. కొద్దికాలంలోనే ఈమెకు ఉన్న శ్రద్ధాసక్తులవల్ల అర్హంత స్థాయిని అందుకొంది. సకులకు దివ్యదృష్టికలదని (Eye of the heaven) బుద్ధభగవానుడు గమనించి, ఈమెకు సంఘంలో ఉత్తమస్థానాన్ని ఇచ్చాడు.

ఒక సంసారస్త్రీ సన్యసించినపుడు ఏమేమి ఒదులుకోవాలి, ఏమేమి పెంపొందించుకోవాలో ఈ గాథలో స్పష్టంగా తెలుస్తుంది. మొదటి భాగంలో భర్త, పిల్లలు, ఇల్లు, సంపదలను త్యజించాలని రెండవ భాగంలో తనలోపలి మోహ, మద మాత్సర్యాలను త్యజించాలని, మూడవ భాగంలో ఎందుకొరకు మనం పుట్టామో ఆ గమ్యాన్ని గుర్తించాలని చెబుతుంది. ఇవి చేయగలినప్పుడు శాంతి లభిస్తుందని ప్రకటిస్తుంది సకుల.

[36]సోన (Radiant one) ఒక గౌరవప్రద కుటుంబానికి చెందిన స్త్రీ. ఈమెకు పదిమంది పుత్రులు, ఒక పుత్రిక కలరు. ఈమె జీవితమంతా

పిల్లలకు జన్మనివ్వటం, వారిని సాకటం, విద్యాబుద్ధులు నేర్పించటం, వారికి మంచి సంబంధాలు చూసి పెళ్ళిళ్లు చేయటంలోనే గడిచిపోయింది. అందుకే ఈమెకు బహుపుత్తిక అనే పేరు కూడా కలదు. భర్త గతించాక, ఆస్తిపాస్తులను తనకేమీ మిగుల్చుకోకుండా పిల్లలకు పంచి ఇచ్చేసింది. కొంతకాలానికి పిల్లల అనాదరణకు గురై కష్టాలు పడసాగింది. బయట ఉండే తన సంతానంపైనా, సంపదలపైనా ఆధారపడకుండా తన లోపల ఉండే స్వశక్తిని నమ్ముకోవాలని ఆమె నిశ్చయించుకొంది. ఈ సమయంలో బౌద్ధసన్యాసులను కలుసుకొని దీక్షతీసుకొని, కఠోరమైన సాధనచేసి అర్హంతగా నిలిచింది.

[37]రాజగృహలో ఒక వడ్డీవ్యాపారస్తుని కుమార్తె బద్ద. ఒకరోజు పురవీధిలో మరణదండన విధించటానికి తీసుకొని వెళుతున్న ఒక దొంగను చూసి మనసుపారేసుకొని, అతనిని తప్ప మరెవ్వరినీ వివాహం చేసుకోను అని తల్లిదండ్రులకు చెప్పటంతో– భద్దతండ్రి తలారులకు భారీగా లంచాలిచ్చి ఆ దొంగను రహస్యంగా విడిపించి ఇంటిలోకి తీసుకొని వచ్చి, స్నానం చేయించి, అలంకరించి, కూతురు ముందు నిలబెట్టాడు. ఆ దొంగ పేరు సత్తుక. ఇంతచేసినప్పటికీ ఇతనిలో ఏ మార్పు రాక, భద్ధ ఒంటిపై ఉన్న నగలను ఎలా దొంగిలించాలా అని ఆలోచించసాగాడు.

మరణదండన నుండి తప్పించుకొన్నందుకు కొండదేవతకు మొక్కుకున్నానని, అది తీర్చుకొనటానికి వెళ్లాలని, బద్దను నమ్మించి ఆమెను ఒక పెద్దకొండపైకి తీసుకొనివెళ్ళాడు సత్తుక. అక్కడ ఆమె ఒంటిపైఉన్న నగలను దొంగిలించి ఆ కొండపైనుండికిందకు తోసేసి చంపెయ్యాలని అతని పథకం. అతని పన్నాగాన్ని గ్రహించిన భద్ధ, మిమ్ములను చివరిసారిగా ఒకసారి కౌగిలించుకోవాలనిఉంది నా ఆఖరు కోర్కె తీర్చమని అని అడిగి, కౌగిలించుకొని క్షణకాలంలో అతనిని ఆ కొండపైనుంచి తోసి చంపివేసింది. ఇంతజరిగిన తరువాత ఇంటికి వెళ్ళటానికి భద్ధకు మొఖం చెల్లక, శ్వేతాంబర జైనమతంలోచేరి సన్యాసిగా జీవనం ప్రారంభించింది. అప్పట్లో జైనమతం

తీసుకోవాలంటే తలపై జుత్తును చేతితో పెకలించుకోవాలి. ఆ విధంగా చేయటంవలన కేశాలు చిక్కులు పడటంతో అప్పటినుండి భద్ధకు భద్ధ కుండలకేశ (Good one with curly hair) అనే పేరు వచ్చింది. ఈమె జైన బోధనలను మొక్కవోని దీక్షతో సంపూర్ణంగా అధ్యయనం చేసి దేశ సంచారానికి బయలుదేరింది.

ఏదైనా ఊరు వెళితే అక్కడ ఒక ఖాళీ స్థలంలో ఒక నేరేడు కొమ్మను పాతి తనతో ఆధ్యాత్మికంగా వాదించేవారికొరకు ఎదురుచూసేది. ఆ ఊరిలో ఎవరైనా ఈమెతో వాదించాలనుకొంటే ఆ నేరేడు కొమ్మను తొలగించి, ఈమెతో వేదాంత చర్చ చేసేవారు. అలా ఈమె యాభై ఏండ్లపాటు ప్రాచీన ఉత్తరభారతదేశంలోని అనేక పట్టణాలు సంచరించి ఎందరినో తన వాదనాపటిమతో ఓడించి దిగ్విజయయాత్ర జరుపుతూ ఒకనాడు శ్రావస్తి వచ్చింది. అక్కడ బుద్ధుని శిష్యుడైన సారిపుత్త తో వాదనకు దిగింది. వీరిరువురూ హెూరాహెూరిగా వేదాంత చర్చ చేసారు. సారిపుత్తజ్ఞాన సంపత్తిని గ్రహించిన భద్ధకుండలకేశ అతనిని గురువుగా ఉండమని కోరింది. సారిపుత్త బుద్ధునివద్దకు వెళ్ళమని చెప్పటంతో, భద్ధకుండలకేశ గృధ్రకూట పర్వతంపై ఉన్న బుద్ధభగవానుని చేరి నమస్కరించగానే, ఆయన “రా బద్ధా” అన్నాడట. ఆ మాటే భద్ధ కు బుద్ధుడు నేరుగా ఇచ్చిన దీక్షగా పరిగణిస్తారు.

[38]పటాచార (wearing one cloth) ఈమె ఒక సంపన్న కుటుంబంలో జన్మించింది. జీవితం నిండా దుర్భరమైన కష్టాలు. పటాచార యుక్త వయసులో ఉన్నప్పుడు తల్లిదండ్రులను కాదని, ఇంటిలో పనిచేసే ఒక సేవకునితో లేచిపోయి పెళ్ళిచేసుకొంది. వీరిరువురు శ్రావస్తికి దూరంగా ఒక పల్లెటూరులో కొద్దిపాటి నేలను సేద్యం చేసుకొంటూ జీవనం చేయసాగారు. పటాచార గర్భం ధరించింది. పురిటి కోసం పుట్టింటికి బయలుదేరగా మార్గం మధ్యలోనే నొప్పులు వచ్చి దారిపక్కనే ప్రసవిస్తుంది.

రెండో గర్భానికి కూడా అలాగే జరుగుతుంది. భర్త పాముకాటుకు గురై మరణిస్తాడు. పుట్టింటికి పోదామని బయలుదేరగా మార్గ మధ్యంలో పెద్దతుఫాను చెలరేగగా, ఆ వరదలో కొట్టుకొని పోయి పెద్ద కొడుకు, గద్ద ఎత్తుకొనిపోయి చిన్నపిల్లవాడు మరణిస్తారు. పుట్టింటి వెళ్ళగా అక్కడ తల్లిదండ్రులు భారీ వానలకు ఇల్లుకూలగా మరణించి ఉంటారు. ఇన్ని బాధలు ఒకేసారి మీదపడటం వల్ల ఆమెకు మతిస్వాధీనం తప్పిపోతుంది. అంతటి దుఃఖంలో ఆమె బుద్ధుని నీడలో చేరుతుంది. ఎడతెగని శోకంతో రోదిస్తున్న పటాచారను ఉద్దేసించి తథాగతుడు ఈ మాటలు పలికాడు

బాధతో, ముంచెత్తిన దుఃఖంవల్ల
మనం కార్చిన కన్నీరుతో పోల్చినపుడు
నాలుగు సముద్రాలలో ఉండే నీరే తక్కువ
తల్లీ! నీకింకా గమ్యం అర్థం కాలేదా!

అలా తథాగతుని బోధనలతో ఆమె స్వస్థపడి ధమ్మప్రచారంలో శేషజీవితాన్ని సాగించింది. తొలి బౌద్ధ సన్యాసినులలో పటాచార చాలా ప్రముఖమైనది. చంద, ఉత్తమ ఇంకా మరికొందరు తమ గాథలలో పటాచారాను ప్రస్తావంచటం గమనించవచ్చు. ఆయా సందర్భాలను బట్టి పటాచార నేర్పుకలిగిన బోధకురాలని, సమర్థత కలిగిన నాయకురాలని అర్థమౌతుంది. (ఈ గాథలో కొన్నివచనాలు పునరుక్తులు)

[39]సర్వం కోల్పోయాక బౌద్ధంలోకి వచ్చిన వారిలో చందా (Moon) ఒకరు. ఈమె ఒక బ్రాహ్మణ కుటుంబంలో పుట్టి చిన్నవయసులోనే మహమ్మారివల్ల (ahiwataka-roga– శ్వాసవలన అంటుకొనే వ్యాధి. మొదట బల్లులు, పాములకు వచ్చి క్రమేపీ కుక్కలు పిల్లులు, చివరకు మనుషులకు కూడా సోకే ప్రాణాంతక వ్యాధి) కుటుంబాన్ని బంధువులను కోల్పోయింది. ఒక అనాధగా మారింది. ఇల్లులేదు, ఉపాధి లేదు. వీధులలో యాచించి

బ్రతకాల్సిన స్థితి ఈమె తన దీనస్థితి నుంచి జ్ఞానమార్గం వైపు ఎలా ప్రయాణించిందో ఈ గాథలో తెలుపుతుంది.

[40]ఆ అయిదువందల మంది స్త్రీలు ఉన్నత కుటుంబాలకు చెందినవారు. ప్రతి ఒక్కరికి పుత్రశోకం ఉంది. బిడ్డలను కోల్పోయిన పటాచారా వారిని ఓదార్చుతున్నది.

[41]వాసెట్టి వైశాలిలో చక్కని కుటుంబజీవితం కలిగిన ఒక కులకాంత. ఈమె కుమారుడు చనిపోవటంతో ఆ పుత్రశోకాన్ని తట్టుకోలేక మానసికంగా నలిగిపోయి పిచ్చిపట్టినదానిలా ఊర్లవెంబడి తిరిగేది. ఒకనాడు మిథిల చేరి బుద్ధుని నీడలో స్వస్థత పొంది. అరహంత స్థాయిని చేరుకొంది. (కొన్ని వచనాలు శైల గాథవలె ఉన్నాయి)

[42]వివిధ బౌద్ధ రచనలలో ఖేమా ఆదర్శప్రాయమైన భిక్షుణిగా స్తుతించబడింది. ఈమెకు మారకు జరిగిన సంభాషణ ఈ గాథ. ఖేమా చాలా అందగత్తె. దేహం స్వర్ణకాంతులతో ప్రకాశించేదట. బింబిసారుని అంతఃపురకాంతలలో ఈమె ప్రముఖ స్థానాన్ని పొందింది. తాను గొప్ప సౌందర్యవతినని ఈమెకు అహంకారం. ఒకనాడు ఖేమా, బుద్ధుని దర్శించింది. బుద్ధ భగవానుడు ఈమెకంటే అందంగా ఉండే ఒక ప్రతిమను సృష్టించి ఆ ప్రతిమలో యవ్వన, మధ్య వయసు, వృద్ధాప్య దశలను ఈమెకు దర్శనం చేయించాడు. అది చూసిన ఖేమా రేపు తన స్థితి కూడా అదే కదా అనే ఆలోచన కలిగి జ్ఞానోదయం పొందింది. అనతికాలంలోనే ఈమె ఉత్తమమైన భిక్షుణిగా పేరు తెచ్చుకొంది. ఒకనాడు కోసలరాజైన పసేనది ఖేమాతో అనేక సూక్ష్మమైన ఆధ్యాత్మిక విషయాలు చర్చించాడు. వాటిలో "నిర్వాణం తరువాత తథాగతుడు జీవించి ఉంటాడా?' అనే ప్రశ్న ఒకటి. బుద్ధభగవానుడు జవాబుచెప్పని ప్రశ్నలను (avyakatas) అంటారు. వాటిలో ఇది ఒకటి. ఈ ప్రశ్నకు ఖేమా పరిపూర్ణమైన, సంతృప్తికరమైన

సమాధానం ఇచ్చినట్లు పసేనది బుద్ధభగవానుడితో చెప్పాడు.

ఒక రాజు వచ్చి ఖేమా పాదాల వద్ద కూర్చొని తన ఆధ్యాత్మిక సందేహాలను తీర్చుకొనేవాడంటే... ఏ మేరకు ఖేమా ఆనాటి సమాజంలో గౌరవ, మర్యాదలను పొందిందో అర్థం చేసుకొనవచ్చును.

[43]సుజాత ఒక సంపన్న వర్గ స్త్రీ. ఆమె తల్లిదండ్రులు ఒక చక్కని ధనవంతుడైన అబ్బాయికిచ్చి ఆమె పెండ్లి జరిపించారు. ఆనందకరమైన వైవాహిక జీవితాన్ని సాగిస్తున్న సుజాత ఒకనాడు బుద్ధభగవానుని దర్శించి, సన్యసించాలని నిర్ణయించుకొంటుంది. భర్త, అత్తమామల అనుమతితో ఆరామవాసినిగా మారింది.

[44]మజ్జ అనే ఒక సంపన్న వ్యాపారి కూతురు అనుపమ. గొప్ప అందగత్తె. ఎందరో రాకుమారులు, ఐశ్వర్యవంతులు ఈమెను పెండ్లాడాలని కోరుకొనేవారు. ఈమె మాత్రం సన్యసించి, స్థిరచిత్తయై ధమ్మమార్గంలో నడచి జన్మరాహిత్యాన్ని పొందింది.

[45]ప్రజాపతి గౌతమి బుద్ధుని పెంచిన పినతల్లి. సంఘారామంలోకి స్త్రీలను బుద్ధుడు మొదట్లో అనుమతించలేదు. ఒకనాడు ప్రజాపతి గౌతమి కపిలవస్తులో బుద్ధుని వద్దకు ఐదువందల మంది స్త్రీలతో కలసి వెళ్ళి "ఓ తథాగతా! అన్ని బంధాలను పరిత్యజించి, బౌద్ధధర్మాన్ని ఆచరించటానికి స్త్రీలు కూడా సంఘంలోకి రావాలనుకొంటున్నారు, వారిని అనుమతించవలసినదిగా ప్రార్ధిస్తున్నాను" అని అడుగగా తథాగతుడు అంగీకరించలేదు. మరో సందర్భములో ప్రజాపతి గౌతమి – కేశఖంధన చేసుకొని, కాషాయ వస్త్రాలను ధరించి, వాచి, దుమ్ము గొట్టుకుపోయిన పాదాలతో బుద్ధుడిని వైశాలి నగరంలో కలుసుకొని స్త్రీలకు ప్రవేశం కల్పించమని ప్రార్ధించింది. బుద్ధుని శిష్యుడైన ఆనందుడు కూడా ఈ ప్రతిపాదనని సమర్ధించాడు. తథాగతుడు మొదట్లో అంగీకరించకపోయినా పదే పదే అభ్యర్ధనల

అనంతరం - కొన్ని ప్రత్యేకమైన కట్టుబాట్లతో స్త్రీలను సంఘంలోకి అనుమతించాడు.

భిక్షుణిలు (సన్యాసినులు) సంఘంలో ద్వితీయ శ్రేణి జీవనాన్ని సాగించేలా ఈ కట్టుబాట్లు ఉన్నాయని వీటిని తొలగించమని ప్రజాపతి గౌతమి చాలా సందర్భాలలో తథాగతుని కోరినట్లు కొన్ని గాథలలో కలదు- మరీ ముఖ్యంగా ఎంత పెద్ద వయసు సన్యాసినులైనా అత్యంత పిన్నవయస్కుడైన సన్యాసికి కూడా- ఎదురుపడినపుడు మోకాళ్ళపైవంగి వందనం చేయాలనే మొదటి సూత్రాన్ని.

కొన్ని ఇతర నియమాలు -బౌద్ధాన్ని స్వీకరించిన స్త్రీలు సన్యాసుల వలె చైత్యాలలో నివసించాలి. ఒక్కొక్కరికి మూడు కాషాయ వస్త్రములు, ఒక బిక్షాపాత్ర, సూది దారం, నీటినివడకొట్టుకొనే పాత్ర, ఒక చాకు ఇవ్వబడతాయి. భిక్షుణిలకు ఇవి కాక బహిష్టుసమయంలో ధరించే మొలత్రాడు అదనం. వీరు నివసించే గదులు సామాన్యంగా మట్టితో కానీ, వెదురుతో కానీ నిర్మించబడి ఉంటాయి. నివాసాలకు సమీపంలో వీరి వసతి ఉండాలి. ఒక ప్రాంతంలో కనీసం 5 మంది భిక్షుణిలు ఉన్నప్పుడే సంఘంగా ఏర్పడాలి.

బుద్ధభగవానుడికి గౌతమి అంటే ఎనలేని ప్రేమ. గౌతమి ఒకనాడు అస్వస్థురాలై ఉండగా- సన్యాసినుల ఆరామంలోకి సన్యాసులు వెళ్లకూడదు అంటూ అప్పటికి అమలులో ఉన్న ఒక నియమాన్ని సవరించి - బుద్ధుడే స్వయంగా గౌతమి వద్దకు వెళ్ళాడు.

[46]ఖేమా స్నేహితురాలు విజయ. ఖేమా భిక్షుణిగా మారాక చేసిన బోధనలకు ప్రభావితమై విజయకూడా సన్యసించాలని నిర్ణయించుకొంది. ఆరామవాసం విజయకు పట్టుపడలేదు. ఒకానొక దశలో సాధారణ జీవితంలోకి తిరిగి వెళ్ళిపోదామనుకొంది. ఏడవ రోజు రాత్రి ఆమెకు

దర్శనాలు కలిగాయి. ఒక పరిపూర్ణమైన భిక్షుణిగా మారిందామె.

[47]చాల, ఉపచాల, శిశూపచాల అక్కచెల్లెళ్ళు. వీరిలో పెద్ద చాల, శిశూపచాల చిన్న. వీరు ముగ్గురు బుద్ధుని ప్రముఖ శిష్యుడు సారిపుత్తుని తోడబుట్టినవారు. వీరందరు సురపసారి అనే బ్రాహ్మణుని సంతానం. మగధ రాజ్యంలో నాలక అనే గ్రామంలో వీరు నివసించేవారు. వీరిలో సారిపుత్త మొదటగా బుద్ధుని అనుసరించి దీక్ష స్వీకరించాడు. అన్నను చూసి సోదరిలు కూడా సన్యసించాలని నిర్ణయించుకొన్నారు. ఈ గాథలో మార దైహిక సుఖాలవైపు చాలాను ఆకర్షించటానికి ప్రయత్నించి విఫలమౌతాడు. వీరి ముగ్గురి గాథలు దగ్గరదగ్గరగా ఉన్నాయి.

[48]వద్ద మాత ఒక సంపన్న కుటుంబంలో జన్మించి సన్యాసం తీసుకొన్నది. ఈమెకు వద్దా అనే ఒక కొడుకు ఉండేవాడు. వద్దా ఒకటి రెండుసార్లు తల్లిని కలుసుకోవటానికి ఆరామానికి వెళ్ళితల్లిమాటలు విని బౌద్ధధమ్మపథంలోకి వైపు ఆకర్షితుడౌతాడు. తల్లిని సలహా అడుగుతాడు. తల్లి వద్దాని ప్రోత్సహించి బౌద్ధ ధమ్మపథం వైపు నడిపిస్తుంది.

[49]థేరవాద బౌద్ధంలో కిసగౌతమి కథ చాలా ప్రసిద్ధిగాంచింది. కిస అంటే బక్కగా ఉండటం. కిస గౌతమి పేద కుటుంబంలో జన్మించింది. పెళ్ళయ్యాక అత్తింటి వారు ఈమె పేదరికం కారణంగా అవమానించేవారు. కిసగౌతమికి ఒక కొడుకు పుట్టాకా, వారసుడిని ఇచ్చినందుకు ఈమెను గౌరవంగా చూడటం మొదలుపెడతారు. దురదృష్టవశాత్తు ఆ కొడుకు చనిపోవటంతో, పుత్రశోకంతో కిసగౌతమికి మతిచలిస్తుంది. కొడుకు మృతదేహాన్ని అందరికీ చూపిస్తూ బ్రతికించమని ప్రాధేయపడుతుంది. చివరకు బుద్ధభగవానుడి ముందు కొడుకు శవాన్ని ఉంచి, బ్రతికించమని కోరగా– ఇంతవరకూ ఏ మరణమూ లేని ఇంటి నుండి ఒక ఆవగింజ తెమ్మంటాడు ఆయన. ఎవరూ మరణించని ఇల్లు ఈ భూమిపైన ఎక్కడయినా

ఉంటుందా? ఆ ఆవగింజ కోసం తిరిగి తిరిగి అలిసిపోయిన గౌతమి జనన మరణాలు అత్యంత సహజమని తెలుసుకొంటుంది. ఇదే మరణం తనకు కూడా వస్తుందని బుద్ధ భగవానుడు ఇలా తెలియచేసాడని కూడా కిసాగౌతమి తెలుసుకొని, జ్ఞానోదయం పొందుతుంది, తన కొడుకు శవాన్ని చేతుల్లోకి తీసుకొని "నా బిడ్డా! నీకు మాత్రమే మృత్యువు వచ్చిందని భావించాను. సకల జీవులకు మృత్యువు తప్పదు అని అర్ధమైంది" అంటూ శవాన్ని తీసుకొని అడవిలోకి వెళ్ళి అక్కడ విడిచివేసి, బుద్ధుని వద్దకు వచ్చి తనకు ధమ్మ దీక్ష ఇవ్వమని అడిగి సన్యసిస్తుంది.

ఇక కిసాగౌతమి పేరుమీద ఉన్న గాథ వివిధ సంఘటనల కూర్పు. మొదట పటాచారఉదంతం ఉండటాన్ని – Caroline David అనే వ్యాఖ్యానకారుడు ఆ భాగం పొరపాటున పటాచార గాథనుండి విడివడి కిసగౌతమి గాథలో తగిలించబడి ఉండవచ్చునని అభిప్రాయపడ్డాడు. అందుకనే ఈ గాథ ఒక క్రమంలో ఉండదు. మొదట బుద్ధుని బోధనలు ఉన్నాయి, తరువాత స్త్రీలుకు ఎదురయ్యే వివిధ కష్టాలు, తరువాత పటాచార ఉదంతం, చివరలో తనగురించి చెప్పుకొన్నది కిసగౌతమి.

[50]ఉత్పలవణ్ణ (colour of blue lotus) గాథ థేరీగాథలన్నింటిలో వ్యాఖ్యానించటానికి జటిలమైనది. వివిధ సంఘటనలు ఈ గాథలో కలిసిపోయి ఉండటమొక కారణం.

ఉత్పలవణ్ణ శ్రావస్తిలోని ఒక సంపన్నుని కూతురు. గొప్ప అందగత్తె. అనేకమంది ఉన్నతవర్గ యువకులు, రాకుమారులు ఉత్పలవణ్ణను పెండ్లాడాలని ప్రయత్నాలు చేసేవారు. ఉత్పలవణ్ణ తండ్రికి ఈ ప్రతిపాదనలన్నీ భయం కలిగించేవి. ఎవరికిచ్చి పెండ్లిచేస్తే ఎవరు తమపై కక్షకడతారో లేక రాజకీయ శతృత్వాలకు కారణమౌతుందో అని ఆందోళన చెందేవాడు. జరగబోయే పరిణామాలను విపరీతంగా ఊహించుకొన్న అతను, ఉత్పలవణ్ణకు బలవంతంగా బౌద్ధ దీక్ష ఇప్పించి సన్యసింపచేసాడు.

ఉత్పలవణ్ణ సన్యసించటం ఇష్టపడని వ్యక్తులలో ఆమె బావ ఆనందుడు ఒకడు. (బుద్ధుని ప్రముఖ శిష్యుడు ఆనందుడు కాదు). అంధవనంలో ఒక కుటీరంలో ఉత్పలవణ్ణ నివసిస్తుందని ఇతను తెలుసుకొని, అందులో దూరి మంచం క్రింద దాక్కొని, ఉత్పలవణ్ణ కొరకు ఎదురుచూసి, వచ్చాక ఆమెను బలాత్కారం చేసాడు. భూమి విచ్చుకొని ఆనందుని లోనికి లాక్కొని అతనిని బడబాగ్నిలో వేసి అతను చేసినపాపానికి శిక్ష విధించింది.

ఉత్పలవణ్ణకు జరిగిన ఉదంతాన్ని దృష్టిలో పెట్టుకొని స్త్రీ భిక్షుణిలు ఒంటరిగా వనాలలో నివసించరాదనే నియమం వచ్చింది. అలా ఆమె ఆరామవాసినులతో పాటు కలిసి జీవించసాగింది. ఒకరోజు–ఉత్పలవణ్ణ భోధనామందిరాన్ని ఊడ్చి శుభ్రం చేసి, ఒక దీపాన్నుంచి, దాని వెలుగు చూస్తూ ధ్యానం చేస్తున్న సమయాన–ఒక్కసారిగా జ్ఞానసాక్షాత్కారమైంది.

అనేక అతీంద్రియ శక్తులను పొందింది. ఇతరులకు దీక్షనొసగే అర్హతను కూడా పొందింది. ఈ అర్హత మొదట్లో బుద్ధునివద్ద మాత్రమే ఉండేది. తదుపరి అనుభవం గడించిన భిక్షువులు, భిక్షుణులు ఆ అర్హతను పొందుతారు. ఈ గాథ మొదటి ఖండికలో ఉత్పలవణ్ణ గంగతిరియ మాత గురించి ప్రస్తావించింది.

***గంగతిరియమాత కథ:*** గంగతిరియమాత శ్రావస్తిలో ఒక వ్యాపారి భార్య. ఈమె భర్త వ్యాపారం నిమిత్తం చాలాకాలం దేశాంతరంలో ఉన్నపుడు, ఈమె గర్భవతి కావటం పట్ల అనుమానంతో ఆగ్రహించిన అత్తమామలు ఈమెను ఇంటినుండి గెంటివేస్తారు. ఈమె భర్తను వెతుక్కొంటూ ఊర్లవెంబడి తిరుగుతూ ఉండగా, ఒకరోజు దారిపక్క ఒక మగబిడ్డకు (గంగతిరియ) జన్మనిస్తుంది. ఆ బిడ్డను ఒక బాటసారి అపహరిస్తాడు. ఈమెను ఒక బందిపోటు బలవంతంగా ఎత్తుకుపోయి తనవద్ద ఉంచుకొంటాడు. అతని ద్వారా ఈమె ఒక కూతురుని పొందుతుంది. ఒకరోజు గంతిరియమాత

తన కూతురిని ప్రమాదవశాత్తు గాయపరచటంతో, బందిపోటు మగడు వచ్చి తనను ఎక్కడ దండిస్తాడో అనే భయంతో ఇంటినుండి పారిపోతుంది. చాలా సంవత్సరాలు గడిచాక గంగతిరియ యుక్తవయస్కుడై, ఈ తల్లి కూతుర్లైన గంగతిరియమాతను, ఆమెకు బందిపోటు ద్వారా పుట్టిన కుమార్తెను పెండ్లిచేసుకొంటాడు. ఒకరోజు గంగతిరియ తన కూతురే తన సవితిగా ఉందన్న సంగతి గుర్తిస్తుంది. ఆ అపరాధనా భావన తట్టుకోలేక సన్యసిస్తుంది.

రెండవ ఖండికలోఉత్పలవణ్ణ జ్ఞానోదయం ఐన సంగతి, మూడవ ఖండికలో ఉత్పలవణ్ణకు అతింద్రీయశక్తులు వచ్చిన సంగతి, నాలుగవ ఖండికలో ఉత్పలవణ్ణకు మార కు సంభాషణ, చివరి ఖండికలన్నీ ఆధ్యాత్మిక సాధన గురించి.

[51]బుద్ధుని కాలంలో పట్టణాలలో నివసించే సంపన్నుల ఇండ్లలో పని చేయటానికి పెద్దసంఖ్యలో సేవకులు ఉండేవారు. యూరప్‌లో మాదిరిగా వీరి క్రయవిక్రయాలు జరిగినట్లు కనిపించదు కానీ పాళీ భాషలో బానిసలపై సంపన్నులు యజమాన్యహక్కులు కలిగి ఉన్నట్లు, వారిగురించి దయ, క్రూరత్వంతో కూడిన వివిధ కథలు కనిపిస్తాయి.

పున్నిక (Complete) ఒక దాసి కూతురు. శ్రావస్తి పట్టణంలో అనాథపిండిక అనే వ్యాపారి ఇంట్లో ఈమె పనిచేసేది. ఆ ఇంట్లోనే పుట్టిన నూరవదాసి ఈమె. ప్రతిరోజు నదికి పోయి గృహావసరాలకు నీరు తీసుకొని వచ్చే అంబువాహిని ఈమె. అనాథపిండికుడు గొప్ప బౌద్ధావలంబి. బుద్ధుడు అనేక వర్షావాసాలు గడిపిన జేతవనం అనాథపిండికుడు సమర్పించిందే.

పున్నిక దాసిగా ఉంటూనే బౌద్ధ మార్గాన నడుస్తూ బుద్ధుని బోధనలను పాటించేది. ఒకనాడు బుద్ధభగవానుని కలుసుకొని, తనకు దీక్ష ఇప్పించమని అడిగింది. ఈమె దాసి కనుక యజమాని అనుమతిలేనిదే సంఘంలో చేరే

అర్హతలేనికారణంగా ఈమె అభ్యర్ధన నిరాకరించబడింది. ఇది తెలుసుకొన్న అనాథ పిండికుడు పున్నికకు దాస్యవిముక్తి ప్రసాదించటమే కాక, తనకూతురుగా దత్తత తీసుకొన్నాడు. అలా పున్నిక బౌద్ధ దమ్మాన్ని స్వీకరించి గొప్పసాధనతో అర్హంత (Arahant) స్థాయిని పొందింది.

పున్నికలో ఆత్మవిశ్వాసం, దృఢనిశ్చయం, సాధనలు మూడు దశలలో కనిపిస్తాయి. మొదట్లో బ్రాహ్మణునితో వాదించి అతనిని బౌద్ధ ధర్మంవైపు మళ్ళించటం, పిదప యజమాని వాత్సల్యాన్ని పొంది సన్యసించే అర్హతపొందటం, చివరగా అకుంఠిత సాధనతో జీవన్ముక్తి సాధించటం.

దాదాపు రెండున్నరవేల ఏండ్లక్రితం పున్నిక అనే ఒక దాసి ఉదకసుద్ధిక అనే బ్రాహ్మణునితో చేసిన సంవాదం ద్వారా ఆనాటి ప్రజలలో ఉండిన మత పరమైన అవగాహనను, కాన్ ఫ్లిక్ట్‌ను అర్థం చేసుకొనవచ్చును.

[52]వైశాలి నగరంలో ప్రమదావనంలో పనిచేసే తోటమాలికి ఒక మామిడిచెట్టు క్రింద ఓ చిన్నారి శిశువు దొరికింది. ఆ శిశువుకు అతడు అంబపాలి/ఆమ్రపాలి (Nurtured by Mango tree) అని పేరు పెట్టి పెంచుకోసాగాడు. ఆమె అపురూపమైన సౌందర్యరాశిగా రూపుదిద్దుకొంది. ఆమెను పెండ్లాడాలని అనేకమంది యువరాజులు పోటీపడి వాదులాడు కొనేవారు. వివాదం చిలికి చిలికి గాలివానగా మారినపుడు– అంబపాలిని వేశ్యగామారి అందరికి ప్రేమను పంచుతూ జీవించమని పెద్దలు తీర్పుచెప్పారట. ఆ మేరకు అంబపాలి వేశ్యగా జీవనం సాగించి అపారమైన ధనాన్ని కూడబెట్టి నగరంలో ఉన్నతవర్గానికి చెందిన వ్యక్తిగా జీవించసాగింది. బింబిసార చక్రవర్తి ద్వారా అంబపాలి ఒక కుమారుడిని పొందింది. ఇతని పేరు విమల కొండన్న. ఒకనాడు అంబపాలి గౌతమ బుద్ధుని బోధనలు స్వయంగా విని, బౌద్ధ భిక్షుణిగా మారి సంఘారామ జీవనం ప్రారంభించింది. తన సంపదలను సంఘపరం చేసింది. గొప్ప ఆరామాన్ని నిర్మించింది.

తథాగతుని నిర్వాణానికి నాలుగు నెలల ముందు అంబపాలి నిర్మించిన ఆరామంలో కొన్నాళ్ళు బసచేసాడు.

అంబాపాలి వేశ్య. అంతఃపురవాసినిగా విలాసవంతమైన జీవితాన్ని అనుభవించింది. అన్నీ పరిత్యజించి బుద్ధుని బోధనల ప్రభావంతో ఆమె వ్రాసిన ఒక గాథలో అందం శాశ్వతం కాదు అనే జీవితసత్యం ప్రకటిస్తుంది. ఈమె కొడుకు విమల కొండన్న కూడా బౌద్ధాన్ని స్వీకరించి సాధనతో అర్హంతస్థాయిని పొందాడు. అంబాపాలి బుద్ధుని కుమార్తెగా పేరు తెచ్చుకొన్నది.

ఏ మతంలోనైనా ఉన్మత్తతలకు దారితీసే ఐహిక సుఖాల పట్ల విముఖతను పెంచేలా బోధనలు ఉంటాయి. బౌద్ధం మినహాయింపు కాదు. ఏమిజన్మంబు, ఏమి జీవనంబు; మానవా ఏమున్నది ఈ దేహం; తోలుతిత్తి ఇది తుటులు తొమ్మిది, లాంటి వైరాగ్య గీతాలలోని భావధారకు 2600 ఏండ్లక్రితం అంబాపాలి రచించిన ఈ గీతమే మూలం అనటానికి సందేహించక్కరలేదు.

[53]రోహిణి (Name of a star) ఒక సంపన్న బ్రాహ్మణ కుటుంబంలో జన్మించింది. యువతిగా ఉన్నప్పుడే బుద్ధభగవానుని గురించి తెలుసుకొని ఆ మార్గంలో జీవించాలని నిశ్చయించుకొన్నది. రోహిణి తల్లిదండ్రులు ఆమె కోరిక మేరకు సన్యసించటానికి అనుమతినిచ్చారు. అనతికాలంలోనే రోహిణి జ్ఞానోదయం పొందింది.

The First Free Women పేరుతో Matty Weingast థేరీగాథలను పూర్తి స్వేచ్ఛగా, కవితాత్మకంగా అనువదించాడు. ఒకరకంగా మాతృకలోని ఆత్మను మాత్రమే తీసుకొని దానిని నిలువెత్తు కవితగా పోతపోసాడు. నిజానికి పైపైన చూస్తే మాతృకకు ఈ అనుసృజనకు అసలు సంబంధం ఉన్నట్టు అనిపించదు, తరచిచూసినప్పుడు మాత్రం మూలంలోని సారం అద్భుతంగా

అనువదించబడిందని అనిపించకమానదు. మాతృకలో ధమ్మపథం ఎంత విశిష్టమైనదో వివరంగా వర్ణించబడింది. ఆ గాథ ఆత్మ ఎంత గొప్పగా, కవితాత్మకంగా వ్యక్తీకరించబడినప్పటికీ Matty Weingast అనువాదం మూలాన్ని విస్మరించిందనే విమర్శను ఎదుర్కోవలసి వచ్చింది.

**రోహిణి – పరిభ్రమించే నక్షత్రం**

దుస్తులు తొడుక్కునంత మాత్రాన
నువ్వు వస్త్రంగా మారిపోవు

భిక్షాపాత్రను మోసుకుతిరిగినంత మాత్రాన
నీకు నువ్వు శూన్యంగా మారవు

సూర్యుడు నీకు వందనమిడడు
చెట్లు నీ పాదాలముందు పువ్వులు కురిపించవు
పిలిచినంత మాత్రాన పక్షులు కూ అని బదులివ్వవు

పథం నీ పెద్దపెద్ద తప్పులను కూడా భరిస్తుంది
పథం నీ పశ్చాత్తాపాలకు కూడా చోటు ఇస్తుంది

అయినప్పటికీ నువ్వుమాత్రం రాత్రికి రాత్రి
నీ దుస్తుల వస్త్రంగా మారిపోలేవు

అది చాలా నెమ్మదిగా మొదలౌతుంది
చాలాసార్లు నువ్వు గమనించవు కూడా
నీ చర్మంపై వాన చుక్క స్పర్శలా
సొరుగులో కత్తిలా
నీజీవితపు ఆఖరువి కాని తదుపరి
ఐదు క్షణాల్లా– అలా
నువ్వు నీ దుస్తుల వస్త్రంగా మారటం

చాలా నిశ్శబ్దంగా మొదలౌతుంది

పథం అనేది పటంలోని గీత కాదు
అది గొప్పగా ప్రకాశించే ఒక ప్రపంచం
నువ్వు ఎక్కడనుంచైనా దానిలోకి ప్రవేశించవచ్చు

ప్రవేశించాకా
ఒకటి రెండు సార్లు నువ్వు బయటకు నెట్టివేయబడొచ్చు
దాని వెలుపలి పొరల్ని ఛేదించగలిగితే
నా సహచరీ!
అప్పుడు నీకు అందుతుంది
పథం పలికే ఆహ్వానం
అదే పథం యొక్క సారం, స్వభావం

[54]వైవాహిక జీవితం విఫలమవ్వటం అనే సమస్యను రెండువేల అయిదువందల సంవత్సరాల క్రితమే ఎదుర్కొన్న కాప(archer) తన స్థాయిలో దాన్ని పరిష్కరించటానికి, కాపరాన్ని నిలబెట్టుకోవటానికి ప్రయత్నించి ఓడిపోయింది. ఇది మానవసంబంధాలలో ఒక అనాదికష్టం. మరీ ముఖ్యంగా స్త్రీలకు.

కాప ఒక వేటగాని కూతురు. కాల ఒక ఆజీవక సన్యాసి.

కాలా బౌద్ధసన్యాసిగా మారకముందు బుద్ధుని సమకాలీనుడైన Makkhali Gosala అనే ఆజీవక మతగురువు వద్ద సన్యాసించాడు. అప్పట్లో బౌద్ధ జైనాల వలే ఆజీవిక సంప్రదాయం కూడా ఒకటి ఉండేది. ఈ ఆజీవక మతానికి మూల పురుషుడు మఖలి గోశాల. ఆజీవకులు చేతిలో ఒక దండాన్ని ధరించి దిగంబరంగా భిక్షాటన చేస్తూ సంచారజీవనం సాగించేవారు. ఆజీవకుల మతం నియతి వాదాన్ని ప్రతిపాదిస్తుంది. నియతి వాదం అంటే "అన్నిటికి విధే కారణమని నమ్మటం". ఈ నియతి వాదం

హిందూ, బౌద్ధ, జైన మతాలలో కనిపించదు. ఇవి కర్మభావనను నమ్ముతాయి. మనిషి చేసిన కర్మల వలన అతని జీవనం నిర్ణయమౌతుందని విశ్వసిస్తాయి.

ఈ కాలా కథ చాలా ఆసక్తికరంగా ఉంటుంది. గౌతముడు జ్ఞానోదయం పొందాక కాశికి వెళుతున్న సమయంలో దారిలో కలిసిన మొదటి వ్యక్తి కాలా. బుద్ధుని చూసి కాలా "నీవేనా అనంతజినుడవు?" అని అడుగుతాడు. (ఆజీవక మతంలో బుద్ధుని అలా పిలుస్తారు). "అవును అది నేనే" అని చెపుతాడు బుద్ధుడు. "అవునా అలాగా" అని ముందుకు సాగిపోతాడు కాలా.

కాలా ఒక ఆజీవిక సన్యాసిగా Nala అనే జిల్లాలో వంకహారా అనే గ్రామానికి చేరుకొంటాడు. అక్కడ వేటగాడు అయిన కాప తండ్రి ఇతనికి ప్రతిరోజు భిక్ష ఇస్తుంటాడు. ఒకరోజు కాప తండ్రి సహచరులతో కలసి పెద్దవేటకు వెళ్ళవలసి రావటం వల్ల ఒకవారంపాటు ఇంటివద్ద ఉండలేని పరిస్థితి వస్తుంది. ఆ సమయంలో కూతురు కాపని, కాలా బాగోగులు చూడమని చెబుతాడు. అలా కాప, కాల ఒకరినొకరు పరిచయమై, అది పెళ్లివరకూ దారితీస్తుంది.

కొంతకాలానికి కాలకు సంసారజీవితంపై విరక్తి కలిగి మరల సన్యాసం తీసుకోవటానికి ఉద్యుక్తుడవుతాడు. అతనిని ఆ పనినుండి ఆపటానికి అనేకవిధాలుగా ప్రయత్నిస్తుంది. మొదట నేను నీకు బానిసగా ఉంటానంటుంది; అందచందాలతో ఆకట్టుకోవాలని ప్రయత్నిస్తుంది; చివరకు బిడ్డను ఎరగావేసి భర్త సన్యసించకుండా ఆపటానికి యత్నిస్తుంది. అన్నీ విఫలమయ్యాకా.. ఒక్కసారిగా స్థిరచిత్తురాలై "సరే అయితే నీ ఇష్టం" అని భర్తకు వీడ్కోలు పలుకుతుంది. బుద్ధభగవానుడికి నా వందనాలు తెలియచేయమని అంటుంది కూడా. అలా భార్యాబిడ్డలను విడిచి నేరంజర నది ఒడ్డున బౌద్ధ ధర్మాన్ని ప్రవచిస్తున్న బుద్ధ భగవానుని చేరి బౌద్ధ సన్యాసిగా మారిపోతాడు కాల. భర్త వీడిన కొంతకాలానికి ఉండలేక కొడుకును తండ్రికి

అప్పగించి తానూ సన్యసించటం ద్వారా తనుకూడ స్వతంత్రురాలని దృఢచిత్తురాలని చరిత్రలో లిఖించుకొన్నది కాప.

[55]సుందరి కాశిలో నివసించే ఒక సంపన్న బ్రాహ్మణుని కూతురు. ఒకనాడు ఈమె సోదరుడు మరణిస్తాడు. సుందరి తండ్రి పేరు సుజాతు, ఇతను పుత్రశోకంతో దుఃఖితుడై వాసెట్టి అనే ఒక వృద్ధ భిక్షుణిని ఈ పుత్రశోకాన్ని అధికమించటం ఎలాగ అని సలహా అడుగుతాడు. వాసెట్టి సుజాతుని బుద్ధుని వద్దకు పంపిస్తుంది. అక్కడ సుజాతు బౌద్ధ దీక్షతీసుకొని, ఆ విషయాన్ని భార్యకు తెలుపమని తన రధాకారునితో చెబుతాడు. భర్త సన్యసించటం పట్ల సంతోషించిన సుజాతు భార్య ఆ వార్త తీసుకొచ్చిన సారథికి బహుమతులీయబోగా అతను తిరస్కరించి తానుకూడా సన్యసించబోతున్నట్లు చెప్పి వెళిపోతాడు. ఈ విషయాలన్నీ సుందరితో చెప్పగా, నాన్నకి పుత్రశోకం ఉన్నట్లుగానే నాకు భ్రాతృశోకం ఉంది, నేను కూడా సన్యసిస్తాను అని చెప్పి, బుద్ధభగవానుని కలిసి ధమ్మదీక్ష తీసుకొంటుంది.

ఈ గాథ సుందరి థేరీగాథ అని ఉన్నప్పటికీ, నిజానికి ఈ గాథలో చెప్పబడిన ఏడు పాత్రల జీవితం కూడా ప్రకటించబడింది.

చాలా గాథలలో పుత్రశోకం తల్లి కోణం నుంచి చెప్పగా, ఈ గాథలో అది తండ్రి శోకంగా చెప్పబడింది. ఈ గాథ ప్రారంభంలో సుజాతు, ఒక పురుషుడు, అది కూడా ఒక బ్రాహ్మణ పురుషుడు – వాసెట్టి అనే ఒక స్త్రీ సలహా కోరటం ఆసక్తికరం. గాథ చివరలో సుందరి “నేను బుద్ధభగవానుడి నోట్లోంచి పుట్టిన బిడ్డను” అని ప్రకటించుకోవటం స్వేచ్ఛకు, ఆత్మవిశ్వాసానికి నిదర్శనంగా భావించాలి.

[56]శుభ ఒక స్వర్ణకారుని కూతురు. అపురూపమైన అందాల రాశి. యువతిగా ఉన్నప్పుడే బుద్ధభగవానుని బోధనలు విని ఆచరించటం ప్రారంభించింది. సామాన్యజీవితం పట్ల విరక్తి కలిగి సన్యాసజీవితాన్ని

ఎంచుకొని ప్రజాపతి గౌతమి వద్ద దీక్ష తీసుకొన్నది. శుభ బంధువులు పదే పదే వచ్చి ఈమెను కలిసి, ఈ సన్యాసజీవితాన్ని విడిచి తిరిగి కుటుంబజీవితంలోకి రమ్మనమని ఒత్తిడి చేసేవారు. వారిని శుభ ఎలా సమాధానపరచిందో ఈ గాథద్వారా తెలుస్తుంది. ఇది ఒకరకంగా కుటుంబజీవనంలోకి తిరిగి రాము మేము అని చెప్పేవారి వాదన. చివరి వాక్యాలు తథాగతునివి. శుభపేరుతో మరొక గాథకూడా కలదు.

[57]పురుషుని అండలేకుండా స్త్రీలు స్వతంత్రంగా నివసించటం వల్ల కలిగే సామాజిక సమస్యలు బౌద్ధమతానికి తెలుసు. దైహికవాంఛల పట్ల వైముఖ్యం పెంపొందించుకోవటమే దీనికి పరిష్కారంగా సూచించినట్లు శుభ చెప్పిన గాథ ద్వారా అర్ధంచేసుకోవాలి.

పై గాథలో శుభకు ఆ యువకునిపై ఏ రకమైన మోహమూ లేదు. శారీరిక వాంఛలపట్ల ఆసక్తి లేదు. బుద్ధుని బోధనల వల్ల అంతర్నేత్రం పొందిన ఆమెకు బాహ్యనేత్రాలు అవసరం లేవని చెప్పటమే ఈ గాథ పరమార్ధం. శుభకు నేత్రం తిరిగి తెప్పించటం అనే ఉదంతం విశేషమైనది ఎందుకంటే బుద్ధభగవానుడు మహిమలు చూపించిన దాఖలాలు పెద్దగా కనిపించవు. ఏది ఏమైనప్పటికీ, థేరీ గాథల ద్వారా ఆనాటి స్త్రీలు ఎంతటి ఆత్మవిశ్వాసంతో, స్వతంత్ర వ్యక్తిత్వంతో, ఎన్ని కష్టాలొచ్చినా నిరాశకు కృంగిపోని దృఢచిత్తంతో, అచంచలమైన స్వేచ్ఛాకాంక్షతో కూడిన జీవనేచ్ఛతో జీవనం సాగించారో ఆశ్చర్యం కలిగించక మానదు

[58]రెండున్నరవేల ఏండ్ల క్రితం కొద్దిమంది స్త్రీలు స్వేచ్ఛగా, సన్యాసినులుగా సంచార జీవనం సాగించినప్పటికీ అధికశాతం మంది వైవాహిక జీవితంలో ఉన్నారు. తథాగతుడు ఒక సందర్భంలో ఆదర్శవంతమైన భార్య తన భర్తకు తల్లిలా, సోదరిలా, స్నేహితురాలిలా, పరిచారికలా ఉండాలి అని చెప్పాడు.

పై లక్షణాలన్నీ కలిగి ఉన్నప్పటికీ వైవాహిక జీవితంలో విఫలమై సన్యసించిన ఇసిదాసి అనే భిక్షుణి చెప్పిన గాథ ఆసక్తికరంగా ఉంటుంది.

ఇసిదాసి ఉజ్జయినిలో ఒక సంపన్న వర్తకుని ఇంట జన్మించింది. ఇసిదాసికి యుక్తవయసు వచ్చాక ఆమె తండ్రి సాకేతపురికి చెందిన మరో సంపన్న వర్తకుని కుమారుడికి ఇచ్చి వివాహం చేసాడు. ఇక అక్కడినుంచి ఇసిదాసి జీవితం ఎన్ని మలుపులు తిరిగిందో గాథలో చెప్పుకొంది.

ఇసిదాసి గాథద్వారా అప్పట్లో స్త్రీ పునర్వివాహం పట్ల సమాజానికి ఏ పట్టింపులులేవని తెలుస్తున్నా, రెండు మూడవ వివాహాలలో ఎక్కువ కట్నము ఇవ్వటం, అయోగ్యుడైన భర్త రావటం లాంటి అంశాలు కూడా గమనించదగినవి.

[59]ఇసిదాసి, సుమేధ గాథలు బుద్ధుని సమకాలీనం కావని బహుశా ఆ తరువాత BCE మూడోశతాబ్దానికి చెంది ఉండవచ్చనే అభిప్రాయం కలదు. సుమేధ కొంచ అనే రాజు కుమార్తె. ఈమెకు అనికదత్త అనే యువరాజుతో వివాహం నిశ్చయం చేస్తారు తల్లిదండ్రులు. ఈమె సకల ఐశ్వర్యాలను, సంసారిక జీవనాన్ని త్యజించి బౌద్ధభిక్షుణిగా మారి ధమ్మమార్గంలో ప్రయాణించ నిశ్చయించుకొంటుంది. ఆక్రమంలో ఈమె తన తల్లిదండ్రులతో, అనికదత్తతో జరిపిన సంభాషణలే ఈ గాథ.



థేరీ గాథల ద్వారా ఆనాటి సమాజంలో స్త్రీ ఎలా జీవించిందో అర్థంచేసుకొనవచ్చును. దుర్భరమైన వైవాహిక బంధంలో ఇమడలేని అనేక మంది స్త్రీల జీవితాలను ఈ గాథలు ప్రతిబింబిస్తాయి– అనాదిగా ఎంతటి విషాదం, దుఃఖం, నిస్సహాయతలు స్త్రీల జీవితాలతో పెనవేసుకొని ఎంతమందిని కబళించి ఉంటాయో ఊహింపశక్యం కాదు. ఇన్నిశతాబ్దాల తరువాత కూడా ఈ విషాదం పరిష్కృతమైందని చెప్పలేం. ఈ స్త్రీలను

కుటుంబం, మతం తప్ప మరొకరు ఓదార్చలేదు చరిత్రలో. ఇలాంటి విధివంచితుల కన్నీళ్ళని తుడిచి, వారికి ఆత్మవిశ్వాసాన్ని కలిగించి, కొత్తజీవితాన్ని ప్రసాదించటంలో మతం పాత్రను విస్మరించలేం.

## బొల్లోజు బాబా

**తల్లిదండ్రులు** బొల్లోజు బసవలింగం, అమ్మాజి
**సహచరి** సూర్య పద్మ
**పిల్లలు** అపరాజిత, బసవ శ్రీధర్
**చదువు** M.Sc. M.Phil., B.Ed.
**వృత్తి** జువాలజీ అధ్యాపకుడు

**రచనలు** యానాం విమోచనోద్యమం (2007)
ఆకుపచ్చని తడిగీతం (2009) కవితా సంపుటి
ఫ్రెంచిపాలనలో యానం (2012)
స్వేచ్ఛావిహంగాలు (2016) (రవీంద్రుని స్ట్రే బర్డ్స్ అనువాదం)
వెలుతురు తెర (2016) కవితా సంపుటి
కవిత్వ భాష (2018) సాహిత్య వ్యాసాలు
మూడో కన్నీటిచుక్క (2019) కవితా సంపుటి
మెకంజీ కైఫియ్యతులు (2020)– తూర్పుగోదావరి జిల్లా
ప్రాచీన పట్టణాలు (2021) – తూర్పుగోదావరి జిల్లా

**ఇ.బుక్స్** ఎడారి అత్తరులు (ప్రముఖ సూఫీకవుల గీతాల అనువాదాలు)
ఇరవై ప్రేమకవితలు ఒక విషాదగీతం
(Pablo Neruda అనువాదం)
రవీంద్రుని క్రిసెంట్ మూన్ అనువాదం
అనువాద కవిత్వం (రెండు వందలకు పైన కవితానువాదాలు)
పరిచయాలు, సమీక్షలు, ప్రసంగాలు (సాహిత్య వ్యాస సంపుటి)
గాథాసప్తశతి విశ్లేషణా వ్యాసాలు, అమరు శతకం,
రూమీ వాక్యాలు

(పై ఇ.బుక్కులు https://archive.org/details/@bolloju_baba వద్ద లభ్యం)

**బ్లాగు** http://sahitheeyanam.blogspot.com/
**ఎఫ్.బి.** https://www.facebook.com/bolloju.baba

**అవార్డులు** ఆకుపచ్చని తడిగీతంకు శిలపరశెట్టి సాహితీ ప్రత్యేక పురస్కారం 2010
ఇస్మాయిల్ సాహితీ పురస్కారం 2017
రొట్టమాకు రేవు కవిత్వ అవార్డు 2018
పాతూరి అన్నపూర్ణ స్మారక సాహిత్య పురస్కారం 2020
పెన్నా సాహిత్య పురస్కారం 2021

Therigathalu - Tholitaram Boudhasanyasinula kavitvam
anusrujana Bolloju baba



థేరీగాథలు తొలి బౌద్ధ సన్యాసినులు చెప్పుకున్న కవితలు, కథనాలు. వాళ్ళంతా దాదాపుగా బుద్ధుడి సమకాలికులు. ఆ కవితలన్నీ కూడా చాలావరకు బుద్ధుడి కాలం నాటివే. కాబట్టి ఒక కవితా సంకలనంగా అవి ప్రపంచ సాహిత్యంలోనే, స్త్రీల తొలి సాహిత్య సంకలనం. తొలి కవితాసంకలనం. ఇవి కవితలుమాత్రమే కాక స్వానుభవ కథనాలు కూడా కాబట్టి ప్రపంచంలోనే తొలి ఆత్మకథనాత్మక సాహిత్య సంకలనం కూడా.

ప్రధానంగా డెబ్భై మంది సన్యాసినుల ఈ అనుభవాలన్నిటినీ కలిపి రాస్తే అదొక ఇతిహాసమవుతుంది. దానికదే ఒక విస్తృత, విషాదమయ, విస్మయకారక ప్రపంచం. ఒక్క మాటలో చెప్పాలంటే, క్రీస్తు పూర్వపు 6వ శతాబ్దమంతా ఈ కవితాసంకలనంలో కనిపిస్తుంది.

గొప్ప విషయమేమిటంటే, వివిధ, విరుద్ధ నేపథ్యాల నుండి వచ్చిన ఆ స్త్రీలంతా ఒక సంఘంగా, ఒక సోదరసమాజంగా మారగలగడం, మనగలగడం.

ఇందులోని ప్రతి కవితలోనూ, ప్రతి కవయిత్రీ తాను మూడు విషయాలూ తెలుసుకోగలిగానని ప్రకటిస్తుంది. ఆ ప్రకటనలో రెండు విశేషాలున్నాయి. మొదటిది, పుస్తకాలకీ, పండితులకీ మాత్రమే పరిమితమయిన జ్ఞానం తాను కూడా పొందగలిగాననీ, రెండవది, ఆ జ్ఞానం పుస్తకాలవల్ల కాక, తన స్వానుభవం మీంచి తాను తెలుసుకోగలిగాననీ. అందుకనే, 2500 సంవత్సరాల తర్వాత కూడా ఆ కవిత్వం ఎంతో సమకాలీనంగానూ, ఎంతో స్ఫూర్తివంతంగానూ వినిపిస్తున్నది.

**వాడ్రేవు చినవీరభద్రుడు**
ప్రసిద్ధ సాహితీవేత్త

₹ 150/-



ISBN 978-93-92968-02-0
9 789392 968143

థేరీ గాథలు • బొల్లోజు బాబా